# కృతిపుష్పాంజలి

—:o:—

పూజ్యులైన మా జనకులు

కీ॥ శే॥ రావుసాహెబు జంపాల

వెంకటేశము చౌదరిగారి

పాదపద్మములకు

భక్తిపూర్వకముగా

సమర్పితము



# తొలిపలుకు

—:o:—

సోదరీమణులారా!

నేను అప్పుడప్పుడు పత్రికలకు వ్రాసిన వ్యాసములు, అచ్చటచ్చట ఇచ్చిన చిన్న చిన్న ఉపన్యాసములు, ఆల్ ఇండియా రేడియో (మద్రాసు)లో మాట్లాడిన కొన్ని విషయములు సమీకరించి ఈ చిన్న పొత్తముగా ప్రకటించితిని.

ఇందు రచించిన వన్నియు స్త్రీల సమస్యలను గురించినవే. ఆంధ్ర నారీలోకమును మేల్కొలుపుటయే నా ఉద్దేశము. ఇందలి వ్యాసములు పాఠశాలలయందు, కళాశాలలయందు చదువు విద్యార్థినులకు, సంసార భారము మోయుచున్న పల్లెటూరి — పట్టణపు — స్త్రీలకు సమముగా నుపయుక్తమగుచుండవలయునని నా ఆశయము.

ఇందు :—

(1) నవ్యస్త్రీ—ఆచార వ్యవహారములు.

(2) మహిళలకు స్వరాజ్యమువస్తే గృహ నిర్వహణ.

(3) పౌరుల సాంఘిక జీవనమునకు గృహమే శిక్షణ కేంద్రము.

(4) తల్లుల కర్తవ్యములు.

అను నాలుగు వ్యాసములు ఆల్ ఇండియా రేడియో వారిచే బ్రాడ్‌కాస్టు చేయబడినవి. వారి అనుమతితో ఇచ్చట ప్రకటించుచున్నాను.

నాకు ఈ పుస్తకమును ప్రకటింపవలయునను ఉద్దేశ్యమును కల్పించి, తదుపరి అనేక పర్యాయములు హెచ్చరించి, నాయెడ తనకుగల సహజ పుత్రికా వాత్సల్యముచే నాకు పెక్కుగతుల నీ గ్రంథప్రకటనమునకు దోహద మిచ్చిన దుగ్గిరాల బోర్డు హైస్కూలు ప్రధానాంధ్రోపాధ్యాయులు సుధీ మిత్ర, శ్రీ ఉభయభాషాప్రవీణ జంపాల వేంకటనృసింహముగారికి నా భక్తి ఉపాయనము.

ఇట్లు
సతీజన విధేయ,
లక్ష్మీ రఘురామ్

55, హేరింగుటన్ రోడ్డు,
చెటపట్, మద్రాసు.
10—9—47.

# ప రి చ య ము

—:౦:—

ఈ " మహిళా ప్రబోధము " సార్థకము. ఇందలి రచనముల నుపేక్షా భావముతో నీయమ మూలవైచి యుంచఁ గాంచితి. ఇవి భారత నారీ జనోప యోగకరములని యెంచితి. ప్రకటనము యోషిద్రత్నములకు ప్రకృత మను కొంటిని. ప్రకటనార్హములు కావేమో యని వెనకాడు బిడ్డకు ధైర్యోత్సాహ ములు గల్పించితి.

విశ్వ విద్యాలయ పట్టభద్రయయ్యు కేవల పాశ్చాత్యాచార వ్యామోహ పాశబద్ధగాక, చిన్ననాటనె భారతదేశ ప్రాచీనార్వాచీన స్త్రీలోక నాగరికతా విశేషములందు మనంబు జొన్పి, తఱచి, నిగ్గుఁ దేల్చి, నిశ్చయించుకొన్న తన భావానుభవముల నిరాడంబరముగ, నిస్సంశయముగఁ దోడివారి కందఁజేయ నుత్సహించినది.

నాగరికుల మనుకొను కొందఱి నేటి రచనములందువలె నొక తెగను బొగడుట, మఱొక తెగను దెగడుట యను మూఢాభ్యాసమీ రచనమందెచ్చటఁ గానము.

గృహలక్ష్మికి వలయు సమస్త ధర్మములందు కేవల మూఢాచార విశ్వాస నిర్బంధితలు, పరిపాక విరహిత క్షణక్షణ పరివర్తనములగు పచ్చి నవీన నాగరక వ్యామోహితలు, సమ్మోదితలై యనుసరించి యలంకరింప నిచ్చించు నుత్తమావశ్యక విషయ మణిమాల నీ వివేకవతి సజాతీ సమూహమున కందింపఁ దివురుట మిక్కిలి ప్రశంసార్హము.

నేటి యువతీ మణులిట్టి యుత్కృష్ట ప్రబోధ సుధాస్వాదనమున ధీబల విశేషలై ఆత్మజాతీయ, దేశీయ వ్యవహారములందు పురోభివృద్ధి కనువగు వర్తనముతోఁ దమ పరంపరాగత శాశ్వత యశోగౌరవాదుల నిష్కళంకముగఁ బ్రకాశింపఁజేయఁ జాలుదురని విశ్వసించుచున్నారము.

ఇందఱసున్నలు, శకటరేఫములు పాటింపఁబడలేదు. సందర్భోచితముగ వాడుక భాషయుఁ గొన్నిట నుపయోగింపబడినది. విసంధిగా వ్రాఁత సాగినది.

ఆత్మదేశాభ్యుదయమున కీ ప్రబోధము చేయఁగ నోపఁగునను నాసతో మహిళా రత్నముల కరాబ్జముల కందింపఁజాలిన విద్యా, వినయ సంపన్నయగు సౌభాగ్యవతి లక్ష్మీ నారాయణమ్మ (లక్ష్మీ రఘురామ్) బి. ఏ., పరిశ్రమము సత్ఫలదాయక మగుగాక.

భారత సతీమ తల్లులిట్టి యత్నములకుఁ బ్రోత్సాహమొసఁగి విజ్ఞానవతుల సేవాఫలము నితోధికముగా ననుభవింత్రుగాక.

ఈ సౌభాగ్యవతి సర్వదా విజ్ఞానార్జన వ్యాప్తులచే లోక కల్యాణమునకు దోహద మిచ్చుచు దేశమునకు, జాతికి యశముగూర్చి శతాయుష్మతియై వర్ధిల్లుగాక.

ఇట్లు,

సుధీమిత్ర, జంపాల వేంకటనృసింహము

# విషయసూచిక

—:o:—

—:o:—

# విజ్ఞాన విషయములు

—:o:—

## 1. దేశాభ్యుదయము - మహిళాకర్తవ్యము

### దేశాభ్యుదయము :

ఈ మాట వినినంతనే ప్రపంచములోని వివిధ జాతులవారు పలు విధముల తమ స్వాభావిక చర్యలనుప్రదర్శింతురు,

దేశాభ్యుదయము అనుమాట - బలముచే ఉన్మత్తులైన జాతిని దూర సామ్రాజ్యములమీదికి దాడివెడల జేయును, మరియొకజాతిని ఆర్యభూమి రక్షణభారము బహు భారమై మూలుగజేయును, విశ్వమానవ దృష్టిగల వేరొక జాతివారి కండ్లముందు వ్యాపార లక్ష్మిని తాండవింపఁజేయును, సరస్వతీ ఆరాధకులైన మరియొక జాతిని నూతనవిద్య, వేషబాషలతో నృత్యము చేయించి లాలించుచుండును, ఇట్లు ఆయాజాతులు వివ్విధముల దేశాభ్యుదయమని తలంచుచుండ మన భారతదేశవాసులు ఇతరజాతులు చేయు గందరగోళముచే నిద్రమేల్కొని నెమ్మదిగా మన దేశాభ్యుదయము "ఏమి" ? అని ఆలోచన మొదలుపెట్టు చున్నారు,

మన దేశాభ్యుదయముపట్ల భారత మహిళలు తమ బాధ్యతను గుర్తించుటయే ప్రథమ కర్తవ్యము.

పురుషులతోపాటు స్త్రీలకు హక్కులు కావలయునను గంభీర నినాదములు నేడు పెక్కు దెసలనుండి వినవచ్చు చున్నవి,

హక్కులు ! హక్కులు !!

ఏల ఈ హక్కులు ? బాధ్యతల నెరుగనప్పుడు హక్కులేల ?

స్త్రీలును, నేడు, పురుషులవలె ఉద్యోగములకొరకు ఎగబ్రాకు చున్నారు కదా ?

## ఉద్యోగము లేల ?

ఆర్థిక అవసరములచే ఉద్యోగములు చేయుచున్న స్త్రీలు నన్ను మన్నింతురుగాక,

వారు అభినందనార్హులేగాని నిందార్హులుగారు, గృహ సంరక్షణ భారములేని స్త్రీలును, జాతిసేవకై వైద్యము, అధ్యాపన, మొదలగు సామాజిక జీవితానికి అవసరములైన వృత్తులను స్వీకరించుట హర్షింప వలసినదే కాని....

విద్యాగర్వముచే వివాహము నిరసించి ఉద్యోగములకొరకు అవివాహితలుగానుండి, వివాహములైనవారు గృహ నిర్వహణమందు శ్రద్ధ తీసికొనక మాతృత్వమును చంపుకొని గృహకృత్యములు చేసికొనుటకు సిగ్గుపడు స్త్రీలు మన సనాతన సంఘమునకు, పవిత్రదేశమునకును అవమానము - తీరని కళంకమును - అపాదించు చీడపుర్వు అనవచ్చును, ఈ చీడపురుగులను మొదలంటు నిర్మూలించుట జాతికి, దేశమునకు శ్రేయోదాయకము,

హైందవ ధర్మరక్షణ భారతస్త్రీ ఉత్కృష్ట ధర్మము,

గృహమును ఆనందమయముగా, శాంతి దాయకముగా చేయుట స్త్రీ విధి.

రూసోపండితుడు కవులను హెచ్చరించినట్లు నేడు "గృహోన్ము ఖులుకండు" అని మహిళ లను హెచ్చరించుట సమయోచితము కాక మానదు.

విదేశ నవనాగరికతా వ్యామోహములో బడి కొట్టికొని పోకుండ - ఉచితానుచితములను సూక్ష్మబుద్ధితో పరీక్షించి - మన అభ్యుదయమునకు కీడుదెచ్చు నాగరికతలను, పారద్రోలుట మానవతి సునాయాసముగా చేయ దగిన ఘన కార్యము,

మన వివాహముల పవిత్రత, గృహముల ఆనందము, మన బిడ్డల ముద్దుమురిపెములు మననిరాడంబరజీవితవిధానము మనదైవభక్తి మనవిజ్ఞానము లను నాశమొనరించు ఇతర నాగరికతల దాడినుండి జాగ్రత్తగా రక్షించు కొనుటయే భారతనారీమణి ప్రథమకర్తవ్యము. ప్రాచీనసత్సంప్రదాయములను రక్షించుటలోనే దేశాభ్యుదయముపట్ల స్త్రీ తన ధర్మమును, కర్తవ్యమును నిర్వర్తించిన దగును.

## ఆంధ్ర దేశము

మనము ఆంధ్రులము. మనకన్న తల్లి ఆంధ్రమాత. నేడు మన మాతదుఃఖములో నున్నది. ఆమెకు స్వాతంత్ర్యములేదు. ఇతరు లామెను బొమ్మనుచేసి ఆడించుచున్నారు. ఆమె దుఃఖమునుజూచి పరితపించువారే గాని నేడు రక్షించువారు కానరారు.

మన సోదరులు శీఘ్రకాలములోనే ఆమెను పరాధీనతనుండి తప్పించి స్వతంత్రను చేయుదురను ఆశగలదు. "మా ఆంధ్రరాష్ట్రము" అని ఎప్పుడు సగర్వముగా చెప్పుకొనేభాగ్యము లభించునో!

మనవారు పూర్వం శూరులని ప్రఖ్యాతి చెందినారు. ఈనాటి ఆంధ్రులు ఆరంభశూరులని పేరుగాంచి యున్నారు. మరి....

విజయనగర సామ్రాజ్యమును స్థాపించి, పరరాజ భయంకరుడై ప్రతిభతో రాజ్యమును పాలించిన కృష్ణ దేవరాయాదులు ఆంధ్రులే. నన్నయ తిక్కనాది మహాకవులు మనవారే. నడుముకట్టి ఖడ్గముధరించి శత్రువీరులఁ జెండాడిన రుద్రమదేవి ఆంధ్రసతీ తిలకమే. భక్తిరసమందు మోక్షానందమును చవిఁజూపిన త్యాగయ్య, మహాయోగి వేమన ఆంధ్రులే.

అమరావతియందు కనబడును ఆంధ్రకళానైపుణ్యము. హంపీ క్షేత్రమందు ఉద్దీపించును ఆంధ్ర బాహుబల మేధాశక్తులు. నాగార్జున కొండయందు రాజిల్లును ఆంధ్రుల విద్యావైభవములు. తంజావూరునందు గాంచుదుము ఆంధ్ర సామ్రాజ్య ప్రతిభా విశేషము.

ఆంధ్రదేశమున గలవు బహు పుణ్యక్షేత్రములు. సింహాద్రి, తిరుపతి, మంగళగిరి, కాళహస్తి, శ్రీశైలము, ద్రాక్షారామము మొదలగునవి. కృష్ణా గోదావరీ తుంగభద్రా నదీమతల్లులు మనకు అన్నప్రదాతలు.

ప్రఖ్యాత ఆంగ్ల విదుషి కజిన్సు సతి - ఒకప్పుడు నాతో అనెను. "మీ ఆంధ్రులు వంగీయులవలె కళాపిపాసకులు, ఔత్తరాహులవలె ధైర్య సాహసములుగలవారు, దాక్షిణాత్యులవలె తెలివితేటలు గలవారు, కర్నాటకులవలె దైవభక్తి పరాయణులు. మీ కండ్లలో ప్రేమ, త్యాగము, సత్యము జ్యోతులట్లు వెలుగుచుండును" అని.

"చెట్టు చెడిపోవుకాలమునకు కుక్కమూతిపిందెలు" అన్నట్లు నేడు అచ్చటచ్చట కనబడు కుక్కమూతిపిందెలు మన ఆంధ్రజాతీయ వృక్షము చెడిపోవుట సూచించుచున్నవి కాబోలు!

పాదుత్రవ్వి నీరు పోయవలయును. అప్పుడు ఆంధ్రమహీజము చిగిర్చి బహు శోభావంతమై నానావిధ పుష్పఫలములతో విరాజిల్ల గలదు.

మన వేషభాషలలో, మన జీవిత విధానములో, మన ఆటపాట లలో, మనపండుగలలో బ్రతిబింబించును అనేక కళలతో ఆంధ్రసౌందర్య లక్ష్మి. నేడు భారతదేశ స్త్రీలందరు ఆంధ్రయువతుల వస్త్రధారణ విధానము ననుసరించు చున్నారు కదా! మన భాషా మాధుర్యము మనము వేరుగ చెప్పుకో నక్కరలేదు కదా! "దేశభాషలందు దెలుగు లెస్స" అన్న యార్యోక్తియే చాటును.

ఇట్టి ఉత్తమమైన ఆంధ్రజాతిని రక్షించుభారము ఎక్కువగా స్త్రీలపై నున్నది. మన జాతి గౌరవములను స్త్రీలే కాపాడవలయును. మనలోనున్న దొసగులను సవరించుకొని ఇతర జాతులయందు గన్పించు ఉత్తమ లక్షణములను గ్రహించవలయును. "పొరిగింటి పుల్లకూర రుచి" యన్నట్లు ఇతరులు చేయునదెల్ల మనకు క్రొత్తకాబట్టి యుక్తాయుక్త విచక్షణలేకుండ పరుల ననుకరింపరాదు. విచక్షణ భావమే స్త్రీకి ఉత్తమగురువు.

—:o:—

# 2. సంఘ సమస్యలు

## స్త్రీ జాతి అభివృద్ధికి పాతివ్రత్యము ఉరిత్రాడా?

స్త్రీల అభివృద్ధి ఎట్టిది? దానిలో పాతివ్రత్యమున కెట్టిస్థానము?

స్త్రీల అభివృద్ధికి పాతివ్రత్యము ఉరిత్రాడా? పాతివ్రత్యము కేవలము బానిసత్వమేయని కొందరు యువతులు పొరబడుచున్నారు. మన ప్రాచీనుల ఆశయములు, పద్ధతులు మహోత్కృష్టములు. సార్థకములు.

స్త్రీల అభివృద్ధికి ఆటంకము పాతివ్రత్యముగాదు. పురుషుల దుర హంకారముచే, స్త్రీలకు కల్పించిన అజ్ఞానాంధకారము. స్వార్థాపేక్షచే కుల భేధములు మొదలగునవి. ఎటుల దృఢముగా మన సాంఘిక జీవనములో పాతుకుపోయినవో అటులే స్వార్థపరులు - లోకజ్ఞానశూన్యులు - అయిన పురుషులు హిందూనారిని పాతివ్రత్యము, గీతివ్రత్యము అను పేరుతో సద్ధర్మముల మరుగుపఱచి, అధర్మములఁ జాటి స్త్రీ యభివృద్ధికి, జాత్యున్న తికి భంగము కలిగించి స్త్రీలను ప్రస్తుత దుస్థితికి తెచ్చిరి. పురుషులకు ఈ ఆచారములు చాల వీలుగనుండుటచే నేడుకూడా వాటినే సంతోషముతో పురుషులు ప్రోత్సహించుచుండిరి. కాని స్త్రీలను న్యాయవిరుద్ధముగ తక్కువ పరచుటవలన కలుగు కీడును గ్రహింపజాలరైరి. మానవజాతి ఎప్పుడు స్వార్థమును త్యజియించి పరార్థమును గ్రహించునో ఆనాడే స్త్రీ పురుష భేధములేకమనము అభివృద్ధి చెందగలము.

పాతివ్రత్యమనగ నేమి ? దానికి నిరంకుశాధికార ప్రియులగు పురుషులు కొందరు అతికించిన ఆచారములెవ్వి ? పతివ్రత అనగా ఏకభర్తృక. అంతియేగాని పతికి నానా చాకిరిచేయు దాసికాదు. ఏకపత్నీత్వము ఏక భర్తృత్వము నిజముగ మానవజాతికి అవశ్య ఆచరణయోగ్యములైన నియమములేగాని పాతివ్రత్యముపేర స్త్రీజాతిని వంచించుటమాత్రము వాంఛనీయముగాదు. పాతివ్రత్యముపేరఁజెప్పు నీచాచారములు మూఢులగుపురుషుల లీలా వినోదములకు హృదయము ఎట్లుకోరునో అట్లు స్త్రీలను బొమ్మలవలె నాడించుటకు సహాయపడు జంత్రగాని చేతలు. కౌశికునిభార్య మహాపతివ్రత. ఎందువలన ? మగడుకోరిన పరస్త్రీని తానే తార్చినందువలన! పాతివ్రత్యమని కల్పింపబడ్డ కథలు, అభిప్రాయములు ఇట్టివేనా ? ఇవి సహింపదగినవా ?

పాతివ్రత్యము పేరుతో జెప్పబడిన హీనధర్మములు స్త్రీలను అజ్ఞానాంధకారములో ముంచినవి. వారికి విజ్ఞానదీధితి లేదు. స్వలాభాపేక్షులైన దుష్టభర్తల క్రూరశాసనములు మన్నించుటే వారిజీవిత పరమావధియైనది. ఈ ఆజ్ఞ ప్రేమచేగాని, భక్తిచేగాని మన్నింపబడుటలేదు. భయముచేతను సంఘ సంబంధమగు ఒత్తిడి చేతను మన్నింపబడుచున్నవి. స్త్రీల అజ్ఞానముచే అభివృద్ధి నిరోధకమగునీ శాసనములు ల్లంఘింపబడుటలేదు.

పరస్పర ప్రేమగౌరవములు దాంపత్యములో కోరదగినవిగాని ఒక్కరుమాత్రమే. రెండవవారిని గౌరవ ప్రేమలచే ఆదరించుచు తాము నాశనమగుట లోకధర్మమునకు విరుద్ధము, గర్హ్యమును.

స్త్రీల అభివృద్ధికిగాని, మానవజాత్యభివృద్ధికిగాని, అత్యావశ్యకమైనది విజ్ఞానము. విజ్ఞానమును ఏ ఆచారములు, ఏ జాతి, ఏ మతము, ఆటంకపరచునో అది గర్హ్యము. అట్టి వానిని సంస్కరింపవలయును.

పాతివ్రత్యమనగా పతిని దైవముగా జూచుటయేకదా? పురుషుడు తన భార్యను దేవిగా జూచినప్పుడు పాతివ్రత్యము స్త్రీల అభివృద్ధి కెందుల కాటంకము కలిగించును? మన ప్రాచీను లిట్టి పద్ధతులన్నియు గొప్ప ఆశయములతో, అనుభవజ్ఞానముతో స్థాపించిరి. ఆ ఆశయములను మరువక, స్వార్థమైననీచ చింతలవిడచి, వారి ఆశయముల ప్రకారమే మనము ప్రవర్తించిన మనకెట్టి నష్టమును కలుగదు. సర్వ కల్యాణమును సిద్ధించును.

భర్త, తనభార్య నెట్లు గౌరవించునో ఆట్లె తానామెను గౌరవించిన స్త్రీజాతియు, తదుపరి మానవజాతియు అభివృద్ధి కాగలదు. అట్లుగాక, ఇట్టిరీతియేగాని పాతివ్రత్యము స్త్రీజాతి అభివృద్ధికి ఆటంకము అనుట పొరపాటు.

పాతివ్రత్యమును స్త్రీలు, పురుషులు దాని నిజమగు ఆశయమును గుర్తించి మన్నించిన అది స్త్రీజాతి అభివృద్ధికి ఏ ఆటంకము కలుగచేయక పోవు టయేగాక అభివృద్ధి పొందుటకు మిక్కిలి సహాయపడును.

## నవ్యస్త్రీ - ఆచార వ్యవహారములు

నవ్యస్త్రీ—నేడు భారత దేశమున రెండు రకములు.

విద్యాభూషణముచే అలంకృతయై నానాదేశ నాగరీకతలను తెలిసి కొని అందు ఉత్తమమైన వాటిని గ్రహించి- వానిని భారత గృహము లందు మెల్లగా మృదువుగా చేర్చుకొని స్వదేశ పూర్వాచారములందలి సత్యములను గ్రహించి భారత గృహమును అనంద దాయకముగా చేయు నేటి నవ్యస్త్రీ ఉత్తమమైన భారత స్త్రీ.

నేటి మన సంఘమునకు వేరుపురుగై, నానాదేశముల వారికి హా స్యాస్పదమై- మన సోదర సోదరీ మణులకు అవమానకరమై, భారత స్త్రీ సౌంధర్య మర్యాదలను తృణీకరించి పాశ్చాత్య నవనాగరికతయే మోక్షో పాయమని భ్రమించి తెన్నుదెలియక విఱ్ఱవీగు నేటి నవ్యస్త్రీ వనితలంచు వారి చిత్రివైఖరి-ఎంతటి విశాలహృదయముగల భారతీయునికేని ఆందో ళన కలిగించుచున్నది.

ఈరకపు నవ్యస్త్రీలకు నే జెప్పదలచిన దేమియు లేదు.

ఉత్తమురాలైన భారత నవ్యస్త్రీకి ఆచారవిధులుతలవ గూడని తలం పులుగావు. అవలంభించరాని అనాచారములుగావు. "తాబట్టిన కుందేటికి మూడేకాళ్ల"ను మూఢనమ్మకములునుగావు. అవి తెలిసితెలియక ప్రేమతో, జాగ్రత్తతోఅమ్మ అమ్మమ్మలు తర తరములనుండి అందించిన మూలధన

:ములు. నేటి నవ్యస్త్రీ వానిలోని ఉచితానుచితములను గమనించి ఏది ఇప్పటి సంఘపరిస్థితులకు తగునో, ఏది తగదో వివేకముతో పరిశీలింప వలసియున్నది. అందులో నూటికి డెబ్బదియైదు వఱకు ఆచారములు ఏదో ఒకసదుద్దేశముతో ఏర్పడినవే. మిగిలిన ఇరువదైదు మొదటివాటిని అవ లంభించుటకు భయము గొల్పుటకు ఏర్పరచినవి. అవియే ఇప్పుడు మూఢ నమ్మకములై అర్థము లేనివై, సంఘ శ్రేయస్సునకు అడ్డంకులై యున్నవి.

సదుద్దేశముతో ఏర్పడ్డ ఆచారములను ఉన్నవాని నున్నట్లు అనుసరింప నక్కఱలేదు. అప్పటి సంఘ పరిస్థితులకును ఇప్పటి పరిస్థితులకును చాలా బేధము కలదు. కావున నేటి సంఘమునకు సరిపోవునట్లు, నాటి సదుద్దేశమునకు లోటు రాకుండునట్లు సరిదిద్దుకొని యనుసరింపవలయును. మిక్కిలి దూరదృష్టితో, శాస్త్రోక్తమైన ఉత్తమదృక్పథముతో (Scientific outlook.) ఆత్మ తత్వజ్ఞాన చింతతో (Psychological basis.) పూర్వాచారములను విమర్శించ వలయును. కొలదియగు పనికిమాలిన దురాచారములను, మూఢనమ్మకములను ధైర్య సాహసములతో, సనాతనసంఘ సంరక్షకులమనుచు దేశమును, జాతిని ముందునకు రానీకుండ నడ్డుపడు వారి పెంకు పట్టుదలలను మూల్గుచున్న ముసలమ్మల గొణుగుడులను "ఊ" కొట్టుచునే విడనాడవలయును.

మన దేశములోనున్న వేనవేల ఆచారములలో ఏది సంఘజీవనమునకు ఆనందకరమో అనుకూలమో ప్రతికూలమో చర్చించుట కష్టము. కాని కొన్నికొన్ని ముఖ్యమైన, స్త్రీలకే ఎక్కువగా సంబంధించిన ఆచార విషయములను పరిశీలింతము.

చాల ఇండ్లలో "మడి" అనుమాట వింటుము. చాదస్తము ముదిరిన ఇండ్లలో అది అంటవద్దు, ముట్టవద్దు, అనియు చలి జ్వరము రగులుచున్నను అనేక పర్యాయములు చన్నీటి స్నానములు చేయుట మొదలగునవి గలవు. ఇట్టివి ఆచారములు గావు. నిషేదింపవలసిన అనాచారములు. కాని వీనిలో పూర్వుల సదుద్దేశము తేట తెల్లముగా కన్పడుచున్నది. అదిఏమన శుభ్రత. నేడు పెక్కురు వంటచేసిన తరువాత స్నానము చేయుదురు. కాని స్నానము ముందుచేసి తరువాత వంట వడ్డన చేసిన మన పరిశుద్ధత గొప్ప నాగరికత వడసిన విదేశీయులను మించును. వంట చేయు పాత్రలు వేరు, వడ్డనవి వేరు, భుజించునవి వేరుగ నుంచిన మన మమన పాత్రలను విదేశీయులు చేసినట్లు (Sterilise)ఉడుకు నీటిలో పొంగించుట మొదలగునవి చేయనవసరము లేదు. అంటురోగములు వృద్ధిగాక నశించుటకు అవకాశముండును. కావున మడి ప్రతి గృహాములోను అవసరమే. కాని శుభ్రమునెఱుగని తడిగుడ్డకట్టి పరుల గర్హించు దురాచారమును దూరముగా పారద్రోల వలయును. మన యింటియందు వలె శుభ్రముగా వంటచేసినను, వారు వేరుజాతివారను కారణమున వారి యిండ్లలో భోజనము చేయకుండుటమూర్ఖత్వము. అగ్రజాతులవారి ఇండ్లలోనైనను శుభ్రముగా వంటచేయని యెడల భోజనము మానుట ఉత్తమము.

ఇప్పటిస్త్రీలలో చాలమంది ఉపవాసముల విలువతెలిసి కొనకపోవుట శోచనీయము. ఉపవాసములవల్ల శారీరకముగానే గాక మానసికముగా కూడ చాల ఉపయోగము కలదు. శాస్త్రవేత్తలును ఈ విషయమున శోధన చేసి వాటి విలువ గుర్తించి యున్నారు. వారమున కొక్కటూరైనను పురుషులు స్త్రీలు ఉపవాసముండుట మంచిది. కాని ఈ తిథి, ఈ వారము

ఈ నెల ఉపవాసముండిన పుణ్యము. పురుషార్థము అని చెప్పునది సత్య మునకు దూరమైనను, పామరులకు ఒక్కొక్క సారియైన ఉపవాసములు చేయునట్లు ప్రోత్సాహించుటకు ఉపయోగకరమైనవి.

విగ్రహారాధన చేయుట మంచిదా? కాదా? యనునది ఒకపెద్ద సమస్య. మనము దేవుని బొమ్మలను పూజించుట ఎట్లున్నను సూర్య చంద్రాదులకు చేయుపూజలలో కొన్ని ప్రత్యక్షమగు లాభములున్నవి. సూర్యుడు చంద్రుడు ఉదయించునపుడును, అస్తమించునపుడును వానినుండి ఒక విధమైన (Electric rays) విద్యుత్ కిరణములు వెలువడుమ. కొన్ని పరిస్థితులలో ఉత్తర ధ్రువము (North Pole) లో పుట్టుగ్రుడ్డి వాండ్రు సూర్యోదయమును జూచి చూపుబొందిన దృష్టాంతరములు గలవు. అ విద్యుత్ కిరణములు మన దేహమును ప్రవేశించిన చాలమంచిది. పెక్కురోగములు అట్టిచికిత్సవలన అంతరించి దేహములు బాగుపడిన వారున్నారు. శాస్త్రజ్ఞులు ఈ విషయమున ఇదివరలో శోధన చేసియు న్నారు. ఇంకను చేయుచున్నారు. కావున ప్రతిస్త్రీ తన దేహము ఆరోగ్య వంతముగా తేజోవంతముగా నుండవలయునన్న సూర్య నమస్కారములు చంద్రుని పూజలు చేయుట శ్రేయస్కరము. ఇవి చేయునప్పుడు వారి దేహమునకు సూర్యరశ్మి, చంద్రకాంతి బాగుగ తగులునట్లు చేయవలెను. సముద్ర స్నానములు మూఢనమ్మకములు గావు. వాని విలువ విదేశీయులును గుర్తించి చాలా లాభమును బొందుచున్నారు.

గర్భిణీ అనుసరింపదగు కొన్ని కొన్ని విషయములు మన ముసలి వాండ్రు చెప్పినవి మూఢనమ్మకముల వలె కన్పట్టును. అందు పెక్కుఆ చారములు ఆరోగ్య సూత్రముల ననుసరించినవగుటయేగాక(Pshychological facts) ఆత్మ తత్వ స్తవికములై యున్నవి. ఇప్పుడు శాస్త్రవేత్తలు

చాలా పరిశోధనచేసి మన ముసలమ్మలు చెప్పుకొన్న ఆచారములనే చెప్పు చున్నారు. దీనికి నిదర్శనము మేరియోస్టూప్స్, వ్రూడ్ మొదలగువారి పుస్తక ములు చదివిన తెలియును.

అమెరికాలో ఆత్మతత్వ పరిశోధనలు విరివిగా జరుగుచున్నవి. అందు మన భారత గృహములలో ఆచారములై ఎన్ని తరములనుం డియో వచ్చు విజ్ఞానమును ఋజువు చేయుచున్నారు. మన పెద్దలు ఇట్టి జ్ఞానమును ఆ కాలమునందే ఎట్లు సంపాదించిరో బహు ఆశ్చర్యకరము! ఇట్టి జ్ఞానముగల మనపూర్వులను అనాగరకులనుచు పరిహసించువారి అవి వేకము నేమని చెప్పవలయును?

నేను పైజెప్పిన ఆచారములేగాక సమిష్టికుటుంబమున స్త్రీ చేయ దగు విధులు కొన్నియు, అతిధి అభ్యాగతులను సత్కరించు విధులు మొదలగునవి పెక్కును తమంత తామే ఉత్కృష్ట కార్యములగుటయే గాక అవి మనస్సును శిక్షణచేసి విశాలహృదయులుగాను, ఆత్మసుఖ త్యాగులను గాను చేయును. కావున ఇట్టివెల్లను నవ్యస్త్రీ తన సంసారపు ఆనంద శ్రేయస్సులకొరకు దీర్ఘాలోచనచేసి పరిశోధించి ఆచారములందు తమ కుటుంబ జాతి దేశమునకుపయుక్తములగు వానిని గ్రహించుట మంచిది. అది కేవలము వారి వారి సంసార జీవనములకేగాక దేశసంఘ జీవనము శాంతి యుక్తముగా జయప్రదముగా జరుగుటకు తోడ్పడును.

నేటిస్త్రీ దూరముగా పారదోల వలసిన అనాచారములు కొన్ని గలవు. అందు ముఖ్యము అంటరాని తనము. సంఘజీవనము సరళ ముగా జరిగి పోవుటకు కులబేధములవంటి నామమాత్ర విభజన ఏదో ఒకటి అవసరము. కాని అది దూరస్థులగుటకు- ఈర్ష్యాళువులగుటకు

గర్వితులగుటకు కారణము కారాదు. అస్పృశ్యత సంఘ శ్రేయస్సు దేశ శ్రేయస్సులకు పిడుగుదెబ్బ. ఘోషాఅను అనాచారము చాలావడిగా నిర్మూలమైనది. కాని దానివలన కొన్ని మర్యాదా హానికరములైన చెడ్డ లక్షణములు పొడగట్టుచున్నవి. వెంటనే వానిని గ్రహించి నిర్మూలించుట నేటి వనితలకు ముఖ్యావశ్యకము.

ఆంధ్రదేశములో ముఖ్యముగా ప్రబలియున్న అనాచారమేమన మేనత్త మేనమామ బిడ్డలను అక్కకుమార్తెను వివాహమాడుట. ఇది ఘోరనమైన దురాచారము. మేనత్త మేనమామ బిడ్డలను, అక్కచెల్లెంద్ర బిడ్డలను పెండ్లిచేసికొనువారు పినతండ్రి పెదతండ్రి బిడ్డలను, అన్నదమ్ముల బిడ్డలను ఏల చేసికొనరాదు? ఒకానొక మతము వారిలో నిట్టి యాచారమును కలదని వినుచున్నాము. పైరకపు వివాహములు భవిష్యత్ సంతతినిబలహీనులుగాను, పనికిమాలిన వారినిగాను చేయును. అట్టి వివాహములు శాస్త్రయుక్తములుగావు. వైద్యులు ఒప్పుకొనరు ఆర్యధర్మ శాస్త్రములను రక్తసంబధముగల వారి వివాహములు కూడ వనుచున్నవి. (Euginics) యుజినిక్సు అనుశాస్త్రము అట్టి వివాహములను నిరసించు చున్నది. నేడు ఆంధ్రదేశమున పెద్ద పెద్ద కుటుంబములు బలహీనులగునట్టి అల్పాయుష్కులగునట్టి, సంతానములు కలదై అంతరించుచున్న వనుటకు కారణము పై వివాహములే యన్న నొక్కి చెప్పవచ్చును. ఆ అనాచారమునుండి ఎంతతొందరగా విరమించిన అంత మేలు. ఈ అనాచారమును వీడుటవలన వంశ వృద్ధియు, ఆరోగ్యవంతమైన సంతతియు ఆంధ్రులు పడయ గలుగుదురు.

ఆంధ్రస్త్రీలు ఏ ఆచారములు గ్రహింపవలయును, ఏది గర్హింపవలయునో శ్రద్ధతో దూరదృష్టితో విమర్శించుకొన వలయును. పచ్చి

నాగరకతకు తావిచ్చి సదాచారముల మానరాదు. దురాచారముల పరిగ్రహింపరాదు.

—:o:—

# 3. గృహనిర్వాహణ

## మహిళలకు స్వరాజ్యమువస్తే గృహనిర్వహణ

స్త్రీలకు స్వరాజ్యమువస్తే గృహనిర్వహణ గతిఏమీ యనునది స్త్రీల సమస్యగాదు. అది కేవలము మన సోదరులను భయపెట్టు పెద్దపులివంటి ఆందోళన. స్త్రీలకు స్వరాజ్యమువస్తే తాము వారలకు ఊడిగము చేయవలయునేమో అను అనుమానపు పెనుభూతము ఒకప్రక్కను. ఇల్లువాకిలి, పిల్లజెల్లను విడిచి వినోదప్రియలై ఉభయభ్రష్టలగుదురను భయము రెండవప్రక్కను పాపము వారిని పీడించుచున్నది. కాని ఈ భయము వారికి అకారణ భ్రమ మూలకముగాని సహేతుకము కాదు.

స్త్రీలకు స్వరాజ్యమువస్తే అనగా—స్త్రీలకు సంపూర్ణ స్వాతంత్రము వస్తే—సంపూర్ణస్వాతంత్ర్యముగల స్త్రీ గృహమందు ఎట్టికార్యము చేయుచున్నను పురుషుడు "ఊ", "ఆ" అనకూడదనికాదు అభిప్రాయము. పురుషుడు తన వ్యవహారములయందు భార్యసలహా తీసికొన్నను తనకు సమంజసమని తోచినట్టు, వచ్చినట్లు ఎట్లు చేయుచున్నాడో అట్లే తాను తనభార్యకు ఇంటిపనులయందు కుటుంబవిషయములయందు సలహాలుఇచ్చినప్పటికిని కట్టకడపటి పరిష్కారము ఆమెకే వదలవలయును.

రస్కిను అను ఒక గొప్ప ఆంగ్లకవిచెప్పినట్లు స్త్రీ గృహమునకు రాణి. పురుషుడు గృహాంతర్య విషయములకు రాజు. తెమగున "రాణి"కి

భార్య అను నర్థముకలదు. అది సార్థకము. స్త్రీకి పురుషునితోబాటు స్వాతంత్ర్యముగల విదేశీయులును స్త్రీ స్థానము గృహమునందేయని ఒప్పుకొనుచున్నారు. స్త్రీ పురుషునితోపాటు ఉద్యోగములు చేయజాలదని కాదు అభిప్రాయము. ముమ్మాటికి స్త్రీ పెక్కు ఉద్యోగములు పురుషులకన్న చక్కగా చేయగలదు. మనదేశ నారీమణులెందరో అతి సమర్థతతో పరిపాలించి తమ యసాధారణ ధీశక్తిని వెల్లడించియే యున్నారుగదా! స్త్రీ రత్నము సంసారమను బంగరుగృహములో రాణించును; రత్నము రాగియందు పొందుపరచిన, తన సహజసౌందర్యమునుకూడ గోల్పోవును కదా ?

కావున స్త్రీ తన స్వాతంత్ర్యమును దుర్వినియోగము చేసి గృహమును వీడి పురుషునితో పోటీచేసిన అట్టి స్త్రీ మార్గదర్శకురాలు గాని, ఆదర్శ స్త్రీగాని కానేరదు. అట్టి స్త్రీ ఆపత్కరమైన గాలిమేడలలోను వ్యాజములైన ఆనందములలోను నివసించుచున్నది. ఎప్పుడో ఒకప్పుడు అవి అన్నియు వాస్తవికతచేత ఎదుర్కొనబడును. అపుడు ఆమె మిథ్యా జీవితములోనుండి మేల్కొనగలదు.

భారత రామాయణాదులనాటి స్త్రీ, నేటి స్త్రీకి లేనిసంపూర్ణ స్వాతంత్ర్యము అనుభవించియున్నది. అపుడు ఆమె గృహమునువిడచెనా ? అన్ని దేశములలోను అన్ని కాలములలోను స్త్రీ గృహమునకు రాణియై యలరారుచున్నది.

స్వార్థపరులగు పురుషులు కొందఱచే వందలాది సంవత్సరముల నుండి గట్టిగా అమలులో నుంచబడ్డ సంఘ చట్టములవల్ల నేటి భారత స్త్రీ, పురుషుని మనోవిలాసములకు ఆటవస్తువై వానికి వినయ విధేయతలుగల

దాసియైయున్నది. స్త్రీని ఇట్టి తుచ్ఛమైన స్థితిలో నుంచుటకు ప్రయత్నించు పురుషుడు ద్రోహియే. కాని స్త్రీ ఇట్టి స్థితినుండి యున్నతి నందవలెనన్న ఆమెకు విద్య ఆర్థికస్థితు లభివృద్ధి గాంచవలయును. అప్పుడే స్త్రీ సంపూర్ణ స్వాతంత్ర్యము బడయగలదు. ఆమెకు సంపూర్ణస్వాతంత్ర్యము ఎప్పుడు కల్గునో అప్పుడే పురుషుడు ఆమెను గౌరవించగలడు. దానికి అమూల్యమైన ఫలము ఏదియన వారి గృహము ఆనంద నివాసమై మనోరంజకమై జన్మ సార్థకత నొసగునదియై యుండుట.

కావున మనకు స్త్రీకి స్వరాజ్యమువస్తే అని భావించునప్పుడు ఆ స్త్రీ విద్యావతియు, ఆర్థిక స్వాతంత్ర్యము గలది అని యూహింపవలయును.

స్త్రీ గృహమున సంపూర్ణస్వాతంత్ర్యము గలది అయితే గృహ నిర్వహణ భారము వహింపదని కొందఱపోహపడుచున్నారు. స్త్రీకిని గృహమునకును దైవమే ఒక విచిత్రబంధము ఏర్పరచినాడు. మృత్యువు నకు తప్ప స్త్రీని అట్టి బంధమునుండి విముక్తురాలినిగా చేయుశక్తులు ఈ విశాలప్రపంచమున మఱొకదానికి లేవు. స్త్రీకి గృహమే సర్వమును స్వర్గ మును. ఆమె ఎప్పుడైన గృహమువిడిచి వినోదార్థముపోయిన అది కేవలము విశ్రాంతికొరకే. పురుషుడు దినమంతయు ధనమార్జించు ప్రయత్నములో కష్టపడి సాయంకాలము క్లబ్బులకు, సినిమాలకు విశ్రాంతికొరకు వెళ్లుట లేదా? అట్లే స్త్రీకిని ఉదయమునుండి రాత్రివరకు గృహకృత్యములను తానే నెరవేర్చుట లేక నౌకరులచేత చేయించుట బిడ్డపాపలను చూచుకొనుట చేత గలుగుశరీరక, మానసిక బడలికవల్ల మధ్యాహ్నమో, సాయంకాలమో విశ్రాంతి కావలయునుకదా? కావున స్త్రీ గృహమును విడిచి బయటికి పోవుట విశ్రాంతికొరకే గాని గృహనిర్వహ భారమునుండి తప్పించుకొను టకు కాదు.

స్త్రీ ఉద్యోగముచేసి ధనార్జనచేయుటకు తన ఆర్థిక దుస్థితియో లేక వేరొక బలవత్తరమైన కారణమో యుండవలయును. కాని గృహనిర్వహణ భారమును వహింపలేకకాదు. అట్టివారు బహు స్వల్పసంఖ్యాకులు. ఈ కొద్ది మందిని ఉదాహరణగా తీసికొని స్త్రీలకు స్వరాజ్యమువస్తే ఇండ్లువదలి ఊళ్ళు తిరుగుటకు బయలుదేరుదురని నిందించుట సబబుగాదు.

సహజ సద్గుణ సంపదగల స్త్రీ తన స్వాతంత్ర్యమును దుర్వినియోగము చేయక తన గృహనిర్వహణము బహు నైపుణ్యముతో సాగించును. తన బిడ్డలకు ఆదర్శయగు తల్లిగాను భర్తకు "చేదోడు వాదోడు" గాను ఒప్పార గలదు. నవీన పద్ధతులు తెలిసికొని గృహకృత్యములు మిక్కిలి సులభముగాను, పొదుపుగాను తీర్చగలదు.

సామాన్య కుటుంబములలో పెక్కుమంది ఆదాయమునకు మించి వ్యయము చేయువారు కలరు. ఇట్టి కుటుంబములు సాధారణముగా పురుషుని విత్తాహకత్వము క్రిందనుండి యుండును. మనదేశము ఇప్పుడు బీద స్థితిలోనున్నది. మనము ఆదర్శజీవితము గడుపుట ఇప్పటి పరిస్థితులలో దుస్సాధ్యము. కావున మన మెల్లప్పుడుచేయు వ్యయము ధనాదాయమును బట్టి యుండవలయును. స్త్రీదే స్వరాజ్యమైన ఆమె ఎప్పటికిని ఆదాయమునకు మించి వ్యయము చేయనేరదు. పురుషుడు సాధారణముగా ముందాలోచనలేక వెచ్చపెట్టును. స్త్రీ దూరాలోచన కలది. కావున మితవ్యయమునే చేయును. పురుషుడు కూరగాయలు కొనిన ఎక్కువ సొమ్మునిచ్చి తెచ్చుననియే అర్థము. పురుషుడు వ్యర్థముచేయునని చెప్పుటలేదు. పురుషుడు స్త్రీకన్న వెచ్చపెట్టువాడని ఋజువుచేయుటకు సక్రమముగా పరిశోధన చేయదలచుకొన్న మీరు ఒకే నిముషమున ఒక స్త్రీకిని ఒక పురుషునికిని ఒక టూత్‌పేస్టు ట్యూబో ఒక సబ్బుబిళ్లయో లేక ఒక తలనూనె సీసాయోఇచ్చి

చూడండి. స్త్రీ ఒకనెల యుపయోగించినది పురుషుడు (సాధారణముగా) పది హేను రోజులలోనే ముగించ గలడు. కావున స్త్రీకే స్వరాజ్యము వస్తే స్త్రీ గృహనిర్వహణము బహుమిత వ్యయముతో చేయగలదు. స్త్రీ అనవసర వ్యయము కాకుండ కాపాడుటయేగాక ఎప్పుడు దేనికి ఖర్చుచేయవలయునో దేనికి చేయకూడదో తెలిసి ఉచితానుచిత బుద్ధితో ఖర్చుచేయగలదు.

స్త్రీకే స్వరాజ్యమువస్తే పురుషుడు సామాన్యముగా ప్రతియింటియందు అత్తకోడండ్ర పోరాటముల నడుమ మెలగవలసిన కష్టమునుండి విముక్తుడుకాగలడు. ఉభయులు ఒకరిమీద నొకరు కొండెములుచెప్పు అవసరమును, తాను విను బాధనుండియు తప్పించుకొనవచ్చును. అనగా స్త్రీలకు స్వాతంత్ర్యమున్న ఇంట నత్తకోడండ్రు ఒకరితో నొకరు పోరాడుకొనవలసిన అవసరముండదు.

స్త్రీకే స్వరాజ్యమున్నచో ఆమె ఆదర్శ మాతృదేవతయై బిడ్డలకు అమృతమే ఉగ్గుపాలతోపోసి పెంచి పెద్దవారినిచేసి వారి మనస్తత్వములను బాగుగ తెలిసికొని వారి విద్యా వివాహాదులను ఎక్కువ ఆనంద దాయకము అగునట్లు చేయగలదు. మాతృదేవతయే బిడ్డలకు ఉత్తమశిక్షణ నిచ్చు గురువుగదా?

స్త్రీకి స్వరాజ్యమువస్తే గృహనిర్వహణము ఎట్టి పరిణామము పొందునోఅను విషయమున ఒక్కొక్క గృహకృత్యమును పరీక్షించి చెప్ప నలవికాదు. కాని అట్టి పరిస్థితులలో స్త్రీ ఉత్సాహ ఉద్రేకములతో మనఃపూర్వకముగా తన గృహకృత్యములను నిర్వర్తించుకొన గలదు.

కేవలము గృహకృత్యములే చక్క దిద్దుకొనుటగాక తనభర్తకు అర్ధాంగియై, బిడ్డలకు మాతృదేవతయై, దేశసేవకురాలై, ఆనంద పొంద

ర్యములకు అధికారిణియై, ఆదర్శ గృహలక్ష్మియని అన్ని దేశములలోను ఆదరమును పొందగలదు.

అట్టి గృహలక్ష్మియొక్క గృహనిర్వహణము మచ్చలేని చంద్రుని వంటిదై యుండును గదా!

## పౌరుల నాగరిక సాంఘిక జీవనమునకు గృహమే శిక్షణ కేంద్రము

ఇంటగెలిచి రచ్చగెలువు మన్న పెద్దలమాట మీరు విని యున్నారు కదా!

గృహములో, శుభ్రముగా ఆరోగ్యకరముగా నుండి ఇంటనుండు వారందరితో చక్కగా చనువుగానుండి, పెద్దవారలయందు భయభక్తులు గలిగి, పిన్నలయందు ప్రేమగలిగి యుండి, ఎవ్వరితోడను కయ్యము లాడక, యితరుల మనస్సును అనవసరముగా నొప్పింపక, నౌకరులను అల్పమైన తప్పులకై దండింపక, తలిదండ్రుల, అత్తమామల, తన బిడ్డల సుఖముకొరకు తన పట్టింపులను త్యాగముచేసి గృహమును ఆనంద మయముచేయు పురుషుడుగాని, స్త్రీగాని, ఈ విశాల ప్రపంచమందు అందరి ఆశీస్సులను బడసి తన జీవితమును పావనము చేసికొనకలుగును. అందరు అటువంటి ప్రవర్తన గలవారై యుండిన నాగరిక సాంఘిక జీవనము ఎట్టి ప్రతిబంధములులేక బహు సుఖదాయకముగా నుండగలదు.

బాల్యావస్థయందు మంచి కట్టుదిట్టములలో పెరిగిన బాల బాలికలు పైన చెప్పినట్లు సుశిక్షితమైన జీవితమును గడుపగలరు. అట్టి తల్లి పసివారుగా నుండగనే తన బిడ్డలకు సుశిక్షితమైన జీవితమునకు కావల

సిన సద్విషయములను ఉగ్గుపాలతోడనే నూరిపోయును. పుత్రికా పుత్రులకు మార్గదర్శకులు కావలెనన్న తల్లి తన బిడ్డలను శిక్షించి, బుజ్జగించి, సత్ప్రవర్తన యలవడునట్లుచేయు శిక్షణకేంద్రము గృహము.

ఈ శిక్షణ కేంద్రము బహు పవిత్రమైన స్థానము. రాచకొమరులు రణరంగమున చతురంగ బలములతో యుద్ధము చేయుటకు యుద్ధ విద్యాశిక్షణ స్థలముకంటెను, మహా పురుషులు యోగాభ్యాసముచేయు పవిత్ర స్థలముల కంటెను పవిత్రతరమైనది గృహమను శిక్షణకేంద్రము. ఈ గృహమునుండి బాల బాలికలు మార్గదర్శకులగు పౌరులుగా తయారై మన దేశ భావి భాగ్య భోగ్యములకు కారకులై మానవ సంఘమునకు సేవ చేయ వారగుదురు.

ఈ గృహమను శిక్షణకేంద్రమున గురువు మాత. ఈ గురుమాత ప్రభావము అనన్య సామాన్యము—అపూర్వము.

భావిపౌరులుగా తయారుచేయు బిడ్డలకు ఈ గురువు మొట్టమొదట నేర్పునది త్యాగము, సేవ. మధురమగు ప్రేమమంత్రముతో భయమను పెనుభూతమును పారద్రోలి త్యాగము, సేవ అను పుష్పములతోనే గురుమాత తన బిడ్డలను అలంకరించును. బిడ్డల మృదుమధుర హృదయము తుమ్మెద వలె ఈ సుగంధ పుష్పములచే ఆకర్షింపబడి వానియందలి త్యాగము మను మధురసమును గ్రోలి గురుమాతకు సంతసము గూర్చును.

ఆమె బిడ్డలు ఉయ్యేలలూగు ప్రాయములో నుండగనే తన ప్రతిచేతలోను త్యాగము, సేవ, బిడ్డలకు తేట తెల్లముగా చూపుచుండును.

అర్ధరాత్రియందు ఏడ్చునపుడు విసుగుచెందక ఎత్తుకొని నిద్రపుచ్చునప్పుడు, తాను ఆకలిగొనియున్నను భుజింపక బిడ్డ అన్నము తినుటకు

చెట్టుచేమల వద్దకును ఆవు బుజ్జాయిల వద్దకును పరుగెత్తుచున్నను విసుగు-కొనక వారి వెనువెంటనే తానునుపోయి ఆ మాటలు, ఈ మాటలుచెప్పి అన్నము పెట్టునపుడును, తన ఆరోగ్యము చెడియున్నను లెక్కింపక తన బిడ్డకు కేవలము తలనొప్పి వచ్చినంత మాత్రముననే కుమిలి శుశ్రూష చేయునపుడును, తన సౌందర్య పోషణమాని తన బిడ్డలను అలంకరించు నపుడును, తనబిడ్డలు తనకన్న తెలివికలవారనియు, అందము కలవా రనియు సంతసించు నపుడును, తన సర్వస్వము బిడ్డల క్షేమమునందే యున్నదని విశ్వసించు నపుడును, తల్లి, త్యాగము, సేవ, బిడ్డలకు నేర్పు చున్నది. బిడ్డలు చిన్నివారైనను వారు ఈ సుగుణములను గుర్తించు శక్తి వారియందిమిడి యుండును.

ఈ విధముగా పెంచబడుచున్న బిడ్డలు భావి ఆదర్శ పౌరులుగా తయారగుటలో సంశయములేదు.

వీరు ఈర్ష్య, స్వార్థములను, త్యాగసేవలతో భంగపరచవలయును. బిడ్డలు పెద్దవారగు నప్పటికి తమ గృహమందు క్రొత్తకుటుంబములవారితో పెక్కు విషయములలో సంబంధము, బాంధవ్యము కలిగియుండవలసి వచ్చును. తమవలె పెంచబడనివారితో ప్రతిదినము ఏదోకొన్ని విషయము లలో భేదాభిప్రాయము తప్పక కలుగును. అప్పుడు వారు ఆ క్రొత్తగా వచ్చినవారితో వాదముచేసిన ఎట్టి లాభమును వుండదు. కాని వారు ఆ క్రొత్తగావచ్చిన వారితో ఎదోఒక అభిప్రాయమునకువచ్చి కలిసి మెలిసి యుండుట అలవర్చుకొన వలయును. ఇట్లు అలవర్చుకొనవలసి వచ్చి నప్పుడు చాల త్యాగము చేయవలసి యుండును. కాని అట్టిత్యాగము చేయని యెడల కుటుంబము చీలిపోవును. మనస్సునకు శాంతి సుఖములు

పూర్ణమైపోవును. కాని అందరు అర్హమగు త్యాగముచేసిన, ఫలము, నిరంతర సుఖకరము కదా!

ఒక కుటుంబములో ఒకరిద్దరు సోమరులై యుండవచ్చును అప్పుడు వారి బాధ్యతగల పని అంతయు నితరుల భుజములమీద బడును. అది నే నొల్లనని తప్పించుకొనుట ధర్మముకాదు. సేవాధర్మములు మరు వక ఇతరులు సోమరులైనను తాము సోమరులుగాక వారిమీద ఆధారపడు వారిని రక్షించవలయును.

అట్లే జనులు వారికి ఇష్టముగాని అభిప్రాయములు గలవారితో కలిసి మెలిసి యుండవలసి వచ్చును. అప్పుడు వారు తమఅభిప్రాయములకు బేధాభిప్రాయము గలవారిని ఈసడించినచో వారినెవ్వరూ లెక్కింపరు. ఎంతమందియో తమ తమ కర్తవ్యములను (సంఘమునకు) గుర్తించని వారుండినచో వారిపనులను ఇతరులు చేయవలసి వచ్చును. ఇంటిలో ఎట్లు మనకన్న పెద్దవారియెడల మర్యాదచూపి పిన్నలను శిక్షింతుమో అట్లే మన సంఘములోను మనకన్న పెద్దలుందురు. వారిని తగినట్లు గౌరవించ వల యును. అట్లుగాక మనమే పెద్దలము, మనకన్న పెద్దలెవ్వరు? అను భావ ముతో ప్రవర్తించినవారికి ఎప్పుడో కీడుమూడును. మన గృహములో మన తలిదండ్రులను ఎట్లు గౌరవింతుమో అట్లే సంఘములోని పెద్దలను గౌరవింపవలయును. ఇంటిలో చిన్నలను ఎట్లు ఆదరింతుమో అట్లే సంఘ ములో మనకన్న పిన్నలను ఆదరింప వలయును. తప్పుచేసినవారు తమ తప్పు గ్రహించి మానునట్లు సద్బోధ చేయవలయును.

ఆ విధముగా గృహములో శుభ్రముగా, ఆరోగ్యకరముగా నుండి తమ తమ పనులను చక్కబెట్టుకొనువారు, ఇంటను బైటను, తమ తమ

చేయుచు ఇతరుల, ఆరోగ్యమునకు, శుభ్రమునకు భంగము గలుగకుండు అట్లును, ఇతరులకు ఇబ్బంది కలుగకుండునట్లును తామే నిగ్రహించుకొను వారుగ తయారగుదురు.

మన కుటుంబములోనివారు ఎట్టి వృత్తులలో నున్నప్పుడును, ఎట్టి రాజకీయ పార్టీలలో నున్నప్పుడును, ఎట్టి పనిచేసినప్పుడును వారిఉద్దేశ్యము లక్ష్యముచేసికొని యూరకుందుమో అట్టే ఇంటిబయట వారినికూడ అర్థము చేసికొని కూడని విమర్శలు చేయకయుండుట ముఖ్యము.

ఇంటిలో ఎల్లప్పుడు అందరితో కలహించువారును, కుటుంబగౌరవము తమగౌరవముగా తలంచనివారును. ఇతరుల సుఖమును, అనుకూలములను తలపనివారును, కుటుంబములోని ఇతరవ్యక్తుల అభిప్రాయములతో ఏకీభవించనపుడు పెద్దలను పిన్నలను తృణీకరించువారును, ఇంటిలోని శుభ్రత ఆరోగ్యము గమనింప లేనివారును, ఇల్లంతయు తన అధికారమున్కింప మంచికొని తన అనుకూలముమాత్రమే చూచుకొను వారును, లోకుల నాగరిక, సాంఘిక జీవితమును పటాపంచలుచేసి అంతయు గందరగోళముచేసి దుఃఖమయముగా చేయుదురు.

కావున ఎవ్వడు తోడివారి సాంఘిక జీవనము సుఖదాయకముగా, నిరాటంకముగా మండవలయునని తలచునో అతడు తన గృహములో అందరితోడను అనుకూలముగాను, ఉత్తమముగాను ప్రవర్తించుట నేర్పు కొనవలయును.

తమ బిడ్డలను సన్మార్గప్రవర్తకులనుగా చేయదలచుకొనినచో గృహిణి మొదట పదార్థములతో బిడ్డలను వర్ధిల్లచేయవలయును. పెద్దవారైన తరువాత అట్టి ప్రయత్నముచేసిన కాచని యినుపకడ్డీని వంచుట ఎంత కష్టసాధ్యమో అంత కష్టసాధ్యమగును.

భావి పౌరులుగా తయారు అగునది పావనమైన గృహమున గనుక పౌరుల నాగరిక సాంఘిక జీవితమునకు గృహమే శిక్షణకేంద్రమని చెప్పబడినది.

గురుమాతవద్ద సుశిక్షణబొంది ఆదర్శపౌరులుగా తయారగుట బాలబాలికల బాధ్యత.

—:o:—

# 4. శిశుపోషణ

## తల్లుల కర్తవ్యములు

భారత స్త్రీయొక్క పత్నీత్వము మాతృత్వము సాటిలేనివి. వివిధ దేశములవారును, వివిధ జాతి మత భేదములుగలవారును భారత వనితకు చేతులెత్తి జోహారు లొనరించు చున్నారు. ఇట్లు వారు భారతస్త్రీని గౌరవించుట ఆమె అందచందములు, విద్యా విభూషణములు చూచికాదు. ఆమె సహజ వినయ స్వార్థరాహిత్యమగు జీవితవిధానమే. ఆమెను అట్టి ఉన్నతస్థానమం దుంచుచున్నది. భారతస్త్రీ తన భర్తకొరకు, తన సంతానముకొరకు, తన గృహముకొరకు చేయుత్యాగము పవిత్రమైనది. అది సాటిలేనిది. భారతమహిళ అట్టి సల్లక్షణమునకు ఆటపట్టు. కావుననే నేడు భారతజాతినాగరికత ఎన్నియో ఆపదలను గడచి నశించక చిరస్థాయిగా నున్నది :

కాని నేడు విద్యావతులగు స్త్రీలు, కొంతమంది పత్నీత్వ మాతృత్వ ధర్మములను క్రమక్రమముగా గోల్పోవుచున్నారనుటకు కారణము విదేశనాగరికతా వ్యామోహ పిశాచావేశమేయని చెప్పవచ్చును.

నేటి విద్యావతులగు స్త్రీలలో కొందఱు తమ కర్తవ్యమును మరచి, తమ బిడ్డలకు ధర్మముగ చేయవగిన పనులు చేయనొల్లక, ఇంటిబయట వివిధవిధములగు క్రీడలయందు ఆసక్తులై, వినోదములయందు కాలము గడుపుచునో, సోమరులై సుకుమారత్వ మనుకొనియో, స్వకార్య నిర్వహణమూని, మాతృత్వమును తృణీకరించి ఆత్మగౌరవ ధర్మములను చంపు కొనువారు ఇరుతెగలవారు కలరు.

మొదటి రకమువారు ధనాంధకారముతో పెంచబడిన సోమరితనమునకు బానిసలైనవారు. వీరు పిల్లలకు అన్నము పెట్టలేరు. ఎత్తుకొనలేరు. ఇంటకూర్చుండి వారి మారాము వినలేరు. కాని బజారులో అమ్ము నిష్ప్రయోజనకరమైన టానిక్కులు తాత్కాలికసుఖప్రపోషణములు సర్వదా త్రాగగలరు. పాటుబడలేని వారి దేహములు అన్ని రోగములకు పుట్టినిల్లు కదా॰

రెండవ రకమువారు పిల్లలను చూచుకొనుట, గృహ కృత్యములు చేసికొనుట మొదలగు పనులు చాల అసహ్య కరమని ఏవగించు కొందురు. వారు బిడ్డలను ఎత్తుకొనిన చలువచీరె నలుగును. బిడ్డల చిట్టిచేతులు పెట్టి ముఖము తడిమిన తమముఖము మురికి అగును!!! ఉద్యోగములు, ధనము, హక్కులు పురుషుని తో బాటు అన్నిటిలోను పోటీ, క్లబ్బులు వగైరాలు వీరి మనస్సులకు బహు సంతసము గలిగించునవి.

పై రెంటు రకముల వారికీ సహాయముచేయు (fifth column propagandists) వారు ఎవరన ఇల్లు కట్టుదిట్టముగా నడుపుస్త్రీని (hen pecking wife) గయ్యాళియని బిడ్డల రక్షణయందు గృహ కృత్యముల యందు నిమగ్నురాలైన స్త్రీని (home bird) ఇంటిగువ్వ అనీ నామధేయము లనిచ్చి గేలిచేయు పురుష ప్రముఖులు. నేటి విద్యావతులగు స్త్రీలలో ఒక

బ్రిడ్జి (Bridge) రబ్బరు ఆడక పోయిన నిద్రపోలేనివారు. ఒకసెట్టు (Set) టెన్నిసు ఆడకపోయిన భోజనము జీర్ణించు కొనలేనివారు, రోజుకు ఒక్క-సారిప్రమైన ఇంట పైట పెత్తనమునకు పోకపోయిన "Fed up" కాగల సుకుమార లతాంగులు ఆరోజు కారోజు పుట్టుకొక్కుచుండెడి బయలుదేరు చున్నారు. ఇట్టిస్త్రీలు కేవలము ఆంగ్ల విద్య నభ్యసించిన స్త్రీలేకారు. పల్లెటూళ్లలో కూడ ఈ జాడ్యము బాగుగ ప్రాకినది, ఇంగ్లీషు చదువు చదివి చెడిరని చెప్పు అనేకులు దీనిని కొంచెము గ్రహింప వలయును. పల్లెటూళ్లలో ఇంగ్లీషు ముక్కలు అలవడని స్త్రీలే నేడు బహుసోమరులై ఎల్లప్పుడు పనికిమాలిన మాటలయందు, పెత్తనములయందు నిమగ్నులై వ్యర్థముగ కాలము గడుపుచు, తమకు తమబిడ్డలకు సర్వనాశనము తెచ్చుచు న్నారు. కాని అజ్ఞానులగు వారు చేసినదానికన్న బాగోగులు తెలిసి కొన గలుగు విద్యావతులు వారియట్లే ప్రవర్తించుట మిక్కిలి శోచనీయము.

స్త్రీలు విద్యావతులు కానిండు, విద్యావిహీనలు కానిండు, వారిస్థానము గృహము. బిడ్డలకు వారే దైవము, గురువు, మిత్రము, దాసి. ఎంతమంది నౌకరు లున్నప్పటికీ బిడ్డలను దాదీ (ఆయా) లకు వదలకూడదు. ఇంటి పనులుగాని, పిల్లల పనులుగాని నౌకరులచేత చేయించు కొనుటలో లోప మేమిలేదు. కాని గృహిణి- తల్లి- ఆ నౌకరులు చేయుపనులు సరిగానున్నదీ లేనిదీ చూచుకొన వలయును. నౌకరులకు పిల్లలయొక్క- ఎట్టి బాధ్యతయు నుండునట్లు తల్లిబిడ్డలను వారివద్దనుంచి యుపేక్షింపరాదు. తల్లుల సమక్ష మునవే పిల్లల పనులు దాసీలచేత చేయించుకో దలచినవారు చేయింప వలయును. తమంతట తామే చేసికొన గలవారు ఆపనులు చేసిన తమకు ఎంతమాత్రమును అవమానకరము కాదని గుర్తించు కొనవలెను,

నేడు మద్రాసు, బొంబాయి, బెంగుళూరు, ఢిల్లీ మొదలగు పెద్ద పట్టణములలో రోడ్డుమీదనున్న పెద్ద చెట్లక్రింద పార్కులలో ఒక పది (perambulators) పిల్లల బండ్లు- అందులో ఒక్కొక్క పాపాయి- వారి దాసీలు-ఆదాసీల స్నేహితులగు పనికత్తెలు-డ్రయివర్లు బట్లర్లు మీటింగులు చేయుట సర్వసాధారణముగా అనుదినము కనబడు (free show)దృశ్యము వారి సభకు ఏబిడ్డయైన ఆకలివల్ల ఏడ్చి ఆటంకము కలిగించిన అక్కడ ఆబిడ్డ దాదియేకాక ఇతరబిడ్డల దాదులు వగైరాలు అందరు కలసి కస్సు బుస్సని ఆపాపను నిర్దయతో దూషించెదరు. కొంతమంది ఆయాలు పిల్లలను కొట్టుట అనేక సారులు రోడ్లమీద కనబడుచుండును. నేను ఇటీవల ఒక మరపునకురాని దృశ్యము చూచితిని.

ఒకవీధిలో ఒకబంగళాలో నుండు డ్రయివర్సు క్వార్టర్సులో ఒక డ్రయివరు ఏవో అంటువ్యాధితో మరణించెను. ఆపేటలో నున్న పెద్ద యింటి బిడ్డల ఆయాలు ఆసాయంకాలము వారి వారి ఆధీనమందున్న బిడ్డలను ఎత్తుకొని ఆ మృత కళేబరమును చూచుటకు పోయిరి. పాపము ఆబిడ్డలు ఆదృశ్యముచూచి ఎంత భయపడిరో కదా! వారిలేత మనస్సుల మీద మృత్యువు యొక్క భయానక దృశ్యపు ముద్రపడెనుగదా! అట్లుపెద్ద వ్యాధితో చనిపోయినవానిని చూచుటకు ఆబిడ్డలను తీసికొని పోకూడదనియు శవదృశ్యము బిడ్డల మనస్సునకు ఎట్టికీడు దెచ్చునో ఆదాసీలకు తెలియదు కదా? తెలిసినను వారుఆలోచింతురా? ఆబిడ్డలే తల్లిరక్షణ యందున్న లేతమనస్సులకు మరికొంతకాలము వరకు నట్టి భయానక దృశ్యములను చూడకుండెడి భాగ్యము కలిగియుండెడిదికదా! వారితల్లులు ఏక్లబ్బులలోనో ఏసినీమాలలోనో ఏఆఫీసులలోనో తమబిడ్డలు దాసీలవద్ద సురక్షితముగా మన్నారని నిర్విచారముతో నుండెదరుకదా!

కావున తల్లులు తమబిడ్డలను ఎక్కువసేపు దాదులవద్ద నుంచరాదు కనుచూపు మేరలోనే బిడ్డలుండ వలయును.

బిడ్డలు తమయాజ్ఞ ఉల్లంఘింప గూడదని ప్రతితల్లియు కోరునుకదా! అట్టితల్లి కోరెనేని బిడ్డతనమాట వినలేదని దండించిన లాభములేదు. ఎప్పుడు బిడ్డలకు వారిపనులు తల్లులు శ్రద్ధగా చేయుటలేదని తోచునో అప్పుడే వారికి తల్లి ఉత్తరవుల యందుపేక్షకలుగును. కొంతమంది మూర్ఖు లనుకొన్నట్లు బిడ్డలు అతివినయముగా నుండునది భయము చేత కాదు! కృతజ్ఞతయే దానికికారణము.

బిడ్డలు పెద్దవారై తల్లిదండ్రులను తిరస్కరించి ఆత్మస్తుతి ప్రియులై తాము పట్టిన కుందేటికి కాళ్లు మూడేయని వాదించు వారగుటకు కారణము వారితల్లి శిక్షాలోపమే. చాలవరకు వారితల్లి సంరక్షణను బట్టియే బిడ్డలు మంచివారుగనో చెడ్డవారుగనో తయారగుదురు.

బిడ్డలకు తల్లిదాసి. బిడ్డలకు ఎప్పుడు ఏమికావలసినది గ్రహించి తమనిద్ర. సుఖము. అలంకారము, త్యాగముచేసి బిడ్డలను రక్షించుకొన వలయును, ఇట్లురక్షింపబడు బిడ్డలు ఎప్పటికిని మాతృదేవిని పూజించు వారేఅగుదురు గాని తిరస్కరింపరు. అట్టిబిడ్డలే మాతృదేశ భావ్యభివృద్ధి కారకులగుదురు.

నేటి విద్యావతులగు స్త్రీలు తాము తల్లులగుటకు సిగ్గుపడ నవసరము లేదు. భారత స్త్రీ ఎప్పుడు గర్వము, సోమరితనము, ప్రాశ్చాత్య నాగరికతా వ్యామోహమువీడి తనగృహము కొరకు బిడ్డలకొరకు స్వార్థరాహిత్యము తో పాటుబడునో ఆనాడే భారతమాతకు సుపుత్రులు సుపుత్రికలు కలిగి ఆమెకు కీర్తి. శాంతి. స్వాతంత్ర్యము చేకూర్చ గలుగుదురు.

## బిడ్డలు—ఆనందము

"తిన్నమ్మకు తిన్నరుచి. కన్నమ్మకు కన్నరుచి" యనిలోకోక్తి.

బిడ్డలుగల తల్లికి తెలియును బిడ్డల ఆనందము. తనవారలకు తాను చేయుత్యాగమును అప్పుడే తెలిసికొనును, తనతల్లియు తనకొరకై ఇట్లేః పాటుబడినది కదాయని అప్పుడు జ్ఞప్తికి దెచ్చుకొనును. మాతృప్రేమ యొక్క తీపితనము —మాతృత్వపు ఆనందదుఃఖములు.

బిడ్డలు బిడ్డలని బిడ్డలు లేనివారు తపించుటయేల? బిడ్డలు లేనివారికి విధి ఆవిధముగా కొన్నిసదుపాయములు కలిగించి యున్నాడు. వారిని బిడ్డల గలవారు గొడ్రాండ్రని నీచముగాజూచుట చాలక్రూరత్వము. గొడ్రాలు అనుపదము మనతెలుగు భాషనుండి తీసివేసిన బాగుండును. వీరు బిడ్డల లేరనుదుఃఖము మరచి దేశసేవకు నడుముకట్టవలయును. వీరు అట్టి సేవ నిరాటంకముగా చేయగలుగుదురు. వారివలె బిడ్డలుగల తల్లిచేయలేదుగదా? మమకార బంధములు ఆమెను గృహమున కీడ్చును. కాని బిడ్డలులేని స్త్రీ సేవ మమకార రాహిత్యమై నిర్మలమై నిష్కపటమై యుండును. తన జీవితము ధనము సర్వము దేశసేవకొరకు వినియోగింపవీలగును, కావున బిడ్డలు లేరను పరితాపము విడిచి ఆదర్శ దేశసేవికలై వారి సాంసారిక జీవితమును సంతానలోప దుఃఖమును దేశసేవచే కలుగు ఆనందముతో ఎదుర్కొనవలయును. అట్లుచేసిన వారికి ఇహపర సౌఖ్యములు లభించును.

ఒకానొక యూరిలో ఒక వృద్ధునకు ఊరిలో నెవ్వరికి ఆడపిల్ల పుట్టినను కళ్ళనీళ్లు వచ్చునట!!!

ఇటువంటి వృద్ధులు కన్నీరు వ్యయము చేయకముందే సంఘములో పుత్రికల వలన తల్లిదండ్రులకు కలుగు ఇక్కట్లు నిర్మూలించుటకు ప్రయత్నించిన బాగుండును గదా!

పుత్రుడు తలిదండ్రులను నరకమునుండి తప్పింపగల సమర్థుడట! స్త్రీయే వేదములు రచించి యుండిన పుత్రికలు లేనివారు నరకమునకు పోవుదురని రచించి యుండెడిదేమో!

బిడ్డలిచ్చు ఆనందమునకు తలిదండ్రులు వారినిజూచి పొందు సుఖమునకు స్త్రీ పురుషభేదము లేదుకదా! సంఘము కొన్ని కట్టుబాట్లువల్ల మనకు మన పుత్రికలుచేయు సేవకు పుత్రుడుచేయు సేవకు భేదమున్నది. ఈసేవలు త్రాసులో తూచిన నిష్పక్షపాత బుద్ధికి భేదము గాన్పింపదు. ఈకట్టుబాట్లు మానవ కల్పితముకదా! ఇట్టిమానవ కల్పితమైన వానికి నరక స్వర్గములతో చుట్టరికము గల్పించుటయేల? ఈ మానవ కల్పితమైన కట్టుబాట్లు స్థిరములు గావు కదా! ఇవికొలది కాలములో ఎట్టి పరివర్తనము పొందునో మన మూహింపలేము.

బహువిచిత్రము మనకర్మ విధానము!

ఆశించెడి వారికి బిడ్డలు కలుగరు. దూషించు వారికి సమృద్ధి. సంతానము తక్కువైనను క్షోభయే, ఎక్కువైననుక్షోభయే! ఈవిషయమున గాంధీ మహాత్ముని అభిప్రాయములు స్త్రీలు ఆదరింప వలసయున్నది.

శిశు పోషణను గురించి వ్రాయవలయునన్న అదియే ఒకగ్రంథమగును. ఆంగ్లమున శిశు పోషణను గురించి అనేక పుస్తకము లున్నవి. అవి కేవలము తల్లులు డాక్టర్లు వ్రాసినవికాక మానసికతత్వ శాస్త్రపరిశోధకులు రాసినవి. ఇట్టివి మనకు సాధారణముగా తెలియని కొన్ని విషయములు తెలియపర్చును. ఆంగ్లమున నున్న అట్టి పుస్తకములను మన సోదర సోదరీ మణులెవ్వరైన తెనిగించిన ఆంధ్రనారీ లోకమునకు సేవచేసిన వారగుదురు. ఆంగ్లవిద్య నభ్యసించిన స్త్రీలు ఆంగ్లమున రచింపబడియున్న గ్రంథములను తప్పక చదువవలయును.

## శిశు పోషణ యందు ముఖ్యముగా గమనింపవలసిన కొన్ని విషయములు

1. బిడ్డలకు ప్రతిదినమును ఆముద మిచ్చిన పెద్దవారైన తరువాత వారికి మలబద్ధకము ఏర్పడును.
2. చిన్నప్పటినుండి ఆముదమునకు బదులు పండ్లరసము (నారింజలేక టమాటో) ఇచ్చిన మంచిది.
3. మీకిష్టము వచ్చినప్పుడో లేక మీతీరికను బట్టియో ఏడ్చి మారాము పెట్టుచున్నారనియో బిడ్డలకు ఆహారము ఇయ్యవద్దు. ప్రతిరోజును ఒకే సమయమున భోజనము ఫలహారములు ఇమ్ము.
4. నియమిత సమయములయందు నిద్రించుట అలవర్చుము.
5. బిడ్డకు ఆరుమాసములు వచ్చిన తరువాత పడకయందు గాని యిచ్చవచ్చిన చోటగాని మలమూత్రములకు పోకుండ చేయుట అలవాటు చేయవచ్చును, వారి అవసరములు తల్లికి సంజ్ఞలుచే దెలుపునట్లు నేర్పవలయును. దీనికితల్లికొంత శ్రమపడ వలసి యున్నది.
6. బిడ్డలకు నూనె తలఅంట్లు అవసరము. గాని మితిమీరి నలుగులు పెట్టినవారి నరములకు హాని.
7. మీరు మీచెలికత్తెలతో బంధువులతో మాట్లాడుకొను విషయములు మీబిడ్డలు వినకూడదు. వారిని దూరముగా ఆటలకుబంపి మాట్లాడు కొనవలయును.
8. పెద్దల విషయములను గురించి బిడ్డలు చర్చించు కొనుచున్న వారినట్టి యభ్యాసమునుండి మరల్ప వలయును,

9. వారిమనస్సు తప్పుడు త్రోవలను పోకుండునట్లు వారికి ఎల్లప్పుడు ఆటలు చిన్నచిన్న పనులు కల్పింపవలయును,

10. వారి తెలివితేటలు అందచందాలను గురించి వారి యెదుట మురియ బోకుము. వారు ప్రగల్భములు ఆడుచున్న కూడదని నిరుత్సాహ పఱుప్రము,

11. ఇతరుల నడవడియందు మీబిడ్డలుతప్పు లెన్నుచున్నచో వారికి తప్పులెన్నుట మంచిదికాదనియు ఇతరులయందుగల సద్గుణము లేవో చూడుమనియు చెప్పుము.

12. మీరు మీబిడ్డలను ఎక్కువ గారాబముతో జూచినను ఎక్కువ దండించినను వారు చెడిపోవుదురు.

13. మీవద్దకు బిడ్డలువచ్చి "అమ్మ ఇదిఇట్లు అదిఅట్లు" అనిచక్కగా భయము సిగ్గులేక అన్ని విషయములును చెప్పుకొనగలుగు స్వాతంత్ర్యము మీరువారికి కల్పింప వలయును. తల్లికిగాక వారు ఎవరికి చనువుగా చెప్పుకొన గలుగుదురు ?

14. మీకు ఇతరులమీద కోపము వచ్చినప్పుడు అకారణముగా బిడ్డలను దండింపవద్దు.

15. కలిమిలేములు కావడి కుండలని తెలిసికొని మీబిడ్డలకు అదృష్ట మున్న హంసతూలికా తల్పము మీదనూ లేనియెడల కటిక నేల మీదనూ పవళించుటను- పంచభక్ష్య పరమాన్నములు పచ్చడి మెతుకులు నిశ్చింతగా తినుటకు- పట్టుపీతాంబరములు మోటునార గుడ్డలు ఆనందముతో కట్టుకొనుటను- గృహకృత్యములు చేయుట- చేయించు కొనుట యందలి సామర్థ్యమును నేర్పుము.

16. మీరు వారికప్పుడప్పుడు కొద్దిగ పైకమునిచ్చి దానిని తగినరీతిని వ్యయము చేయుట నేర్పుడు. మీరు వారికి ద్రవ్యము ఎట్లువ్యయము చేయవలయునో నేర్పని యెడల వారుపెద్దవారైన తరువాత ఖర్చుచేయవలసి వచ్చినప్పుడు అయోమయమున బడుదురు. మీరు వారికప్పుడప్పుడు ఇట్లు డబ్బుయిచ్చు చుండిన వారు పెద్దవారై వారిస్వాధీనమందు పెద్దమొత్తము ఉన్నప్పుడు విచ్చలవిడిగా వెచ్చము చేయుదురు. అందువలన రేమి అనుభవింప వలసివచ్చును.

17. పిల్లలకు చిన్నప్పటినుండి వారిబట్టలు, పుస్తకములు, చెప్పులు బొమ్మలు ఆటవస్తువులు ఆయానియమిత స్థలములందు పెట్టుకొనుట నేర్పుము.

18. జాగ్రత్త, శుభ్రత, ఓర్పుమొదలగు సద్గుణములు పెద్దలనిచూచి పిల్లలు నేర్చుకొనెదరు. కావున మీరుశుభ్రముగాను జాగ్రత్తగాను ఓర్పుమొదలగు ఉత్తమగుణములు గలవారుగనుండవలయును.

19. దగ్గినప్పుడు తుమ్మినప్పుడు, ఆవలించినప్పుడు చేయినోటికిఅడ్డము పెట్టుకొనుట నేర్పుము.

20. ఫలములు కడిగి తినుట అలవాటు చేయుము.

21. ప్రతిరోజును రాత్రినిద్ర పోవుటకు ముందు పండ్లుకడిగికొనుట బయటికి వెళ్లినపుడు కాళ్లుచేతులు కడుగుకొనుట అలవాటుచేయుము.

22. పత్రికలు పుస్తకములు చదువుటయందు అభిలాష కలుగునట్లు చేయుము. ప్రత్యేకముగా బిడ్డలకై ప్రకటింపబడు పత్రికలను

పుస్తకములను చదువుటకిమ్ము. బొమ్మలను కొని ఇచ్చినట్లు మీబిడ్డలకు పుస్తకములు కొనిఇచ్చుమతి ఇమ్ము.

23. పిల్లలు గోడలు తలుపులు సామానులుమీద పిచ్చిగీతలు గీయు చుండిన వారిభావనా చాతుర్యము చూచుచు మరియొక అదిచెడ్డపని అని చెప్పివారిని నివారించవలయును.

24. పరుండి చదువుట అలవాటుచేయకుము.

25. చదువుతోపాటు ఆటలుకూడ నేర్పుము.

26. మీరు పుత్రికా పుత్రభేదము చూపవద్దు అట్టివిభిన్న భావము వారి సోదరత్వము యొక్క పవిత్రతను భంగపరచును.

27. బిడ్డలకు పెద్దలయందుభక్తి మిత్రులయందు ప్రేమ, బంధువుల యందు అభిమానము, నౌకరులయందు ఆదరము, కలిగియుండుట అలవాటుచేయుము.

—:o:—

# 5. విద్యా వినయములు

## విద్య—వినయము

విద్య—

స్త్రీకి విద్యయే విభూషణము. విద్య కీర్తి నిలయము. విజ్ఞాన దీపము.

"చదువునకు తోడు వినయము
కుదిరిన నెత్తావిగలుగు కుందనమువలెన్."

చదువుకొనిన స్త్రీకి వినయము అత్యవసరము. వినయములేని చదువు బూడిదలోపోసిన పన్నీరు చందమే.

విద్యయన్న—ఆంగ్ల విద్యయేకాదు. జ్ఞానమిచ్చునది విద్య. కాని ఆంగ్లవిద్యను నిరసించుట అర్థములేని కోపావేశ ఫలితము. ఆంగ్ల విద్య మనకందరకు అవసరము. కాని ఆంగ్లవిద్యను మాత్రమే పడసి ఇతర ఆవశ్యకమైన విద్యల బడయకున్న మనము వృద్ధినందజాలము. మన పాఠశాలల యందలి విద్యాప్రణాళికలను మార్చవలసి యున్నది. కాని ఆమార్పు క్రమముగా వచ్చువరకు ఆంగ్లవిద్య వద్దనుట పొరపాటు. మనమే సొంతముగా ఆ మార్పును గృహమునందు తెచ్చుకొన వచ్చును.

స్త్రీలు అన్యభాషలు పురుషులకన్న చాల తొందరగా నేర్చుకొన గలరు. మనకు పరిసరములలోనున్న కన్నడము, అరవము, రాష్ట్రభాషయై విజృంభింప నున్న హిందీ మొదలగునవి మనస్త్రీలు నేర్చుకొన వలయును. వేదములు, కాళిదాసు మొదలగు గొప్ప కవుల కవితామృతము గ్రోలదల చినచో సంస్కృతము పఠింపవలయును.

స్త్రీకి సంగీతము, పుష్పమునకు సువాసన వంటిది. అన్ని పుష్పము లకు సువాసన యుండనట్లు అందరు స్త్రీలు చక్కగా పాడలేరు. సంగీ తము బాగుగ పాడగలవారు దానియందు శ్రద్ధతీసికొని కృషి చేయవల యును.

నృత్యము: ఈకళను ఇప్పుడుకూడ కొంతమంది హేయభావముతో జూచుట శోచనీయము. సుస్వాభావముతో ఈకళను అభ్యసించిన తప్పేమి? ఇది ఆ బాలగోపాలము నానందమున నోలలాడించు నుత్కృష్ట కళగదా?

మన ఆంధ్రస్త్రీలలో మంచికవిత్వము చెప్పగలవారు, మధురముగా గ్రంథములు రచింపగలవారును అనేకులు గలరు. వీరు విడియముచేతనైన

నేమో, ఇతరులు పరిహాసము చేయుదురను భయముచేతనైన నేమి వారు రచించినవానిని ప్రకటించుటకు భయపడు చున్నారు. మన ఆంధ్రపత్రికలలో కేవలము స్త్రీలకొరకే స్థాపింపబడిన కొన్ని పత్రికలు ఇటువంటి స్త్రీ రచయితలను ప్రోత్సహింప జూచినవి. కాని ఇంకను తగినన్ని స్త్రీ జనోపయోగకరములగు పత్రికలు బయల్వెడలి స్త్రీల విద్యా—విజ్ఞానాభివృద్ధికి దోహద మొనగగలవని నమ్ముచున్నాను.

మన ఆంధ్రములో చెప్పుకొనతగిన నవలలు చాల స్వల్పము—ముఖ్యముగా పరిశోధక నవలలు—ఆంధ్ర సోదరీమణులు వారి తీరిక సమయమందు ఈ కొరతను తీర్చుటకు కృషిచేసిన బాగుండును.

నేటి మన స్త్రీలలో కొంతమందిని అజ్ఞానాంధకారము విడలేదు. తెలిసీ తెలియని జ్ఞానముతో విరుగబడు చున్నారు. విద్యావతులగు స్త్రీలు వీరికి జ్ఞానదీపపు ప్రకాశ విశేషమును చూపవలయును. కావున విద్యావతులు, వారికి వీలున్న, గ్రామములకేగి వారికి తెలిసిన విద్యచేకూపస్థమండూకములవలె నున్న సోదరీమణులకు విశాల ప్రాపంచిక జ్ఞానము కలవారినిగ చేయవలయును.

ప్రతి స్త్రీయును నిత్యావసరముల దీర్చుకొనదగినంత యైనను వైద్యము నేర్చుకొని యుండవలయును.

## విద్యార్థినులకు సలహాలు

(ఆంధ్ర మహిళాసభ, మద్రాసు, హాస్టలు వార్షికోత్సవ సందర్భమున చెప్పిన ఉపన్యాసము).

మీ హాస్టలు "డే", మీరు జరుపుకొనుచుండ నా విద్యార్థినీదశ జ్ఞాపకమునకువచ్చి ఆ విద్యార్థినీ జీవితములోని ఆనందము మీ అందరితోబాటు నేనుకూడ అనుభవించు చున్నాను.

విద్యార్థిదశలోని ఆనందముగాని ఉత్సాహముగాని నిర్మలమైనది. ఏవి విద్యార్థిదశలో ఆనందాన్ని ఉత్సాహాన్ని ఉత్పాదిస్తవో అవే మనము పెద్దవాళ్ళమైన తరువాత ఆ ఆనందాన్నిగాని, ఉత్సాహాన్నిగాని ఇవ్వలేవు. దానికి కారణము సంసారములోని ప్రతి బంధకములనెడి క్రూరఖడ్గములు మన మనో వికాసాంకురముల నన్నిటిని మొదలంట కోసివేయును. ముఖ్యముగా స్త్రీ తన సంసారబంధములలోబడి ఇతర సౌఖ్యములను అనుభవింప నేరదు. కావున సమయము మించకముందే నిర్మల, అమాయక, ఆనంద ఉత్సాహాలను పూర్తిగా అనుభవించి, ఆ అనుభవమును సద్వినియోగము చేయండి. నేను మిమ్ములను ఆనందించండి అని చెప్పినానని రేపటినుండి సినిమాలకు, దుస్తులకు, హోటళ్ళకు మీ తలిదండ్రులు పంపిన ద్రవ్యము ఖర్చుచేసికొని ఆనందించామని తృప్తిపడకండి. నేను మిమ్ములను పూర్తిగా ఆనందించండి అని చెప్పినది మన, విద్యార్థిదశలోని మమకారరాహిత్య, అమాయక, స్వాతంత్ర్యములయొక్క ఆనందామృతము. ఆ ఆనందము విద్యార్థినులు విద్యార్థినీదశలో అనుభవింప గలిగినదే గాని, ఇతరులు అనుభవింపలేరు.

కావున మీ రెల్లరూ మీ తలిదండ్రులు విద్య చెప్పించినంతకాలము మహాభాగ్యమనుకొని చక్కగా చదువుకొనండి.

స్త్రీ నేడుపొందు విద్య తనకుగాని, సంఘమునకుగాని ఉపకారము చేయక అపకారము చేయుచున్నదను పెద్దమనుష్యులు నేడును లేకపోలేదు. చదువుకొన్నంత మాత్రముననే ఆడపిల్లలు అన్నివిధముల చెడిపోవుదురనుమాటలు విపరీతపు భ్రమభరితములు. అట్లు చెడిపోవువారిని ఇనుపగోడలమధ్య బంధించి బాగుచేయగలరా? ఈ విషయమును గురించి నేనెక్కువగా చెప్పదలచలేదు. త్వరలోనే స్త్రీల విద్యార్జనమును విరసించు

వారు వివేకముచేత తమ యభిప్రాయముల మరల్చుకొని తీరెదరని నా నమ్మకము.

నేటి విద్యావిధానము స్త్రీకి ఎక్కువ ఉపకారము చేయునని కాక పోవచ్చును. కాని అది ఎప్పటికిని అపకారము చేయనేరదు. త్వరలో స్త్రీ విద్యావిధానమునకు తగిన మార్పులు విద్యాభిలాషులు చేయుదురని విశ్వ సించు చున్నాము.

నేను ఈ దినము మీకు మూడుసలహాలు ఇవ్వదలచు కొన్నాను.

మొదటిది ఏమన **Dignity of work** (పనిపాటల ఘనత). గృహ ములో, ఆనందము, సుఖము, సౌందర్యము ఉండవలయునన్న స్త్రీపురుషు లిర్వురు గృహకృత్యములలోని వారి వారి వంతు పని చేసికొనవలయును. ఎంత శ్రీమంతురాలైనను ఇంటికి పెద్దయగు స్త్రీ ఇంటిపనులయందు స్వయముగా శ్రద్ధ తీసికొననియెడల ఆ గృహము నిర్జీవమై యుండును. మీకు రోజును వంటమొదలగు పనులు చేయవలసిన అవసరము లేకపోయి నను ఆ పనులన్నియును మీరందరూ నేర్చుకొని యుండవలయును. ఏపని గాని మీకు బాగుగ వచ్చిననే మీ నౌకరులచేత చేయించుకో గల్గుదురు. మీరు యింటియందు చేయదగు పనులన్నియు నేర్చుకొనవలయును. వంట, కుట్టు, ముగ్గువేయుట, చెరగుట, పాలు పితుకుట, మజ్జిగచేయుట, నేయి కాచుట, వడ్డించుట, బట్టలు ఇస్త్రీచేయుట మొదలగు ముఖ్యమైన పనుల న్నియూ మీరు నేర్చుకొని యుండవలయును. ఈ పనులు చేయుటకు మీ రెంతమాత్రమును సిగ్గుపడ నవసరములేదు. ఈ పనులన్నియూ చేతనైన యువతియే గృహమును చక్కగా దిద్దుకొనగలదు. అట్టి యువతియే **Real accomplished girl** (ప్రవీణురాలైన బాలిక).

౫. తెలిసికొనవలసినది—(Psychology) మానసిక శాస్త్రము చదువవలయును. మీ రెవరైన విదేశములకేగి చదువ దలచిరేని ఈ శాస్త్రమున కృషిచేసిన ఎంతయో ఉపయోగముండును. అమెరికాలో ఈశాస్త్రమున పరిశోధనకు కావలసిన పెద్ద పెద్ద లెబొరేటరీ లున్నవట. ఈ మానసిక శాస్త్రము చాల ఉపయోగకరమైన విషయములు దెలుపును. ఇది మిగిలిన శాస్త్రములకన్నిటికి పునాదివంటిది. ముఖ్యముగా ప్రతిస్త్రీ ఈ మానసిక శాస్త్రము తప్పక తెలిసికొనవలయును. ఈవిద్యకు కావలసిన పుస్తకములు ఇంగ్లీషున పెక్కులుగలవుగాని తెలుగునలేవు. ఇప్పుడిప్పుడే రెండు పుస్తకములు వెలువడినట్లు వింటిని. అవి ఎక్కడైన దొరికినచో వానిని గాని లేనియెడల ఇంగ్లీషు పుస్తకములే గాని మీరు చదువవలయును. మీ విద్యాధికారులను మీకు యీ మానసికశాస్త్రము ఒక నిర్బంధవిషయముగా చెప్పమని కోరండి. దాని ఉపయోగము ఇంత, అంత యని చెప్పలేను. మీరు దానిని చదివిన దానివిలువ మీరే గుర్తించగలరు.

౬. చేసికొనవలసినది—Optimistic out look in life develope చేసికొనుట—అది ఏమన మనకెంతటి కష్టమువచ్చినను సర్వమును మంచికొరకే యనెడి సిద్ధాంతము. పిన్నలు గనుక మీకిది విపరీతముగా నుండవచ్చును, ఈ జీవితములో కష్టసుఖములు కావడికుండలు. అందరకు ఎప్పుడో ఒకప్పుడు కష్టములు రాకమానవు. ఆ కష్టములు వచ్చినప్పుడు—మనకన్న దురదృష్టవంతు లెందరు గలరు? సౌఖ్యమన నెచ్చటనున్నది? పూర్తిగా సౌఖ్యమునే అనుభవించువారు ఎక్కడైన గలరా? దీనికన్న ఎక్కువ కష్టములు వచ్చిన ఏమి చేసెడివారము? అంతకన్న ఇదియే మేలుకదా?" అని మనలను మనమే ప్రశ్నించుకొనిన వాటి జవాబులే మనకు మనశ్శాంతి

నివ్వగలవు, ఉపనిషత్తులలో గాని బైబిలులో గాని యున్న వేదాంతపు సలహా ఇదియే.

నేను నేడు మీకిచ్చిన మూడు సలహాలు శ్రద్ధతో అనుసరించెదరను విశ్వాసముతో, నన్ను ఈనాడు ఇచ్చట మీఅందరను కలిసికొనుటకు అవకాశమిచ్చిన విద్యార్థులకు వందనములు అర్పించుచూ నా ఉపన్యాసము విరమింతును,

—:0:—

# 6. మ త ము

దైవాన్వేషణ మార్గమే మతము. ఈ దైవస్థలమునకు మానవ మనస్సు చేరుటకు అనేక రహదారు లున్నవి. ఈ దారులనే మతము లందురు.

అందు బహువిశాలమై, విశ్రాంతి నిచ్చుటకు ఇరుప్రక్కల ఫలవృక్షములు కలదై కొండలు, లోయలు, అరణ్యములు దాటుచు త్రోవలో అనేకములగు కాలిత్రోవలను కలుపుకొనుచు గమ్యస్థానముచేరు పెద్ద రాజ మార్గమే హిందూమతము. ఈ దారి కిరుప్రక్కలను విశాల శాఖోపశాఖలు గలిగియున్న వృద్ధ వృక్షములు అనేకములు గలవు. వానియందు ఉపనిషత్తులు, వేదములు, పురాణములు, భగవద్గీతయను ఫలములు వ్రేలాడు చుండును. ఈ త్రోవనబోవు బాటసారులు ఈ వృక్షములక్రింద కూర్చుండి తమ ప్రయాణపు బడలిక దీర్చుకొందురు. ఈ ఫలములను భుజింతురు. ఫలములు భుజించినవారిలో కొందరు ఆ ఫలమును భుజించుటవల్ల గలుగు శక్తివల్ల ముందుకు ప్రయాణము ఉత్సాహముతో సాగింతురు. మరి

కొందరు ఆ సంస్థలచే మరగి అచ్చటనే గృహములను ఏర్పరచు కొందురు. మూడవ తెగవారు ఆపండ్ల మాధుర్యము నందుకొనలేక ఇండ్లకు మరలుదురు.

ఈ హిందూ మతపు రాజమార్గమున గలిసికొన్న చిన్న చిన్న కాలిబాటలు, బౌద్ధమతము, జైనమతము, ద్వైతము, అద్వైతము, విశిష్టాద్వైతము, శైవము మొదలైనవి.

ఇదిగాక మిగిలిన రహదార్లు చాల యిరుకైనవి. అవి ఎడారులలో నుండి పోవును—కావున నా మార్గముల బోవువారికి నీడ, ఫలములు మార్గమధ్యమున దొరకవు. ఎక్కువ వైశాల్యముగలవి కావు గనుక ఈ రహదార్లమీద బోవు బాటసారులు హిందూ మతమను మార్గమున బోవు వారివలె కులాసాగా, సునాయాసముగా బోలేరు. ఈ రస్తాలలోనికి ఏ చిన్న బాటయువచ్చి కలియవు. ఈ రస్తాల చివర, గమ్యస్థానమువద్ద ఒక్కొక్క చెట్టుగలదు. దానికి బైబిలు, కోరానుఅను ఫలములు గలవు. ఈ రస్తాల పేర్లు క్రైస్తవ మతము. మహమ్మదీయ మతము మొదలగునవి.

ఈ పెద్ద, చిన్న బాటలయందు బాటసారులు ఎల్లప్పుడును పోవుచు, వచ్చుచు నుందురు. వీరు తమతో శరీరమును తీసికొనిపోరు. మనస్సునే అధిరోహించి వెళ్ళుదురు. వీరు గమ్యస్థానమున జూచునది ఒక్కటే. అక్కడ సత్యమను ఇటుకలతో, జ్ఞానమను సున్నముతో కట్టబడిన ఒక అదృశ్యమైన కట్టడములో దైవమునుగాంచుదురు. అచ్చట చూచివచ్చిన వారందరు చూచినది ఒక్కటైనను చెప్పునప్పుడు ఒక్కొక్కరు ఒక్కొక్క విధముగా చెప్పుదురు. క్రైస్తవ మతము మార్గమున పోయినవాడు "క్రీస్తు"ను చూచితినని చెప్పును. మహమ్మదీయ మతమను రాస్తామీద పోయినవాడు "అల్లా"ను జూచితినని చెప్పును.

వారు గమ్యస్థానమున చూచిన దైవము ఆకారము లేనివాడనియు విఘ్నుడనియు, అందరు ఏకభావముతోడనే తెల్పుదురు.

ఈ మార్గములలో ప్రయాణముచేసి గమ్యస్థానము చేరక ఇంటికి మరలినవారు ఒకరితో నొకరు కయ్యమాడుదురు. "నావాడు, నీవానికన్న ఎక్కువ చూచెనని" ఆరంభించి వివాదములతో ఒకరి నొక్కరు తెగటార్చు కొనువరకు వత్తురు. కాని వానివాడును, వీనివాడును ఒక్కడానినే కదా చూచినది ! ఎందులకు వారికీ కయ్యములు.

మరికొందరు నీవు ఆరస్తాను బోవ వీలులేదు. మేముబోవురస్తానే వెళ్ళవలెను అనియు, మేముబోవు రస్తా మీరస్తాకన్న మంచిదనియు జగడమాడు చుండెదరు, ఈ జగడములవల్ల ఇటీవల కొన్నిలక్షల మానవుల రక్తము భూమిపాలయ్యెను. ఇతరులతో పోరాడుటకు ఏమి ఆగత్యము ? ఎవ్వరికైన ఏదేని మంచియనితోచిన చెప్పవచ్చును. కాని నిర్బంధముచేసిన ఇరువురకు నాశనము. ఎవరిచ్ఛ వచ్చినట్లు వారుపోయిన అందరకు శ్రేయస్కరము.

హైందవ మతమను రోడ్డుచివర, గమ్యస్థానము చేరకముందు అన్నిమతములరోడ్లు ఇందులోనే కలసి గమ్యస్థానము చేరుటకు అవకాశము లున్నవి. కొంతమంది క్రైస్తవ మహమ్మదీయ మిత్రులు అట్టి అవకాశము లున్నట్లే ఋజువు చేయుచున్నారు. కాని మరికొందరు అట్టి అవకాశము లెంతమాత్రమును లేవని చెప్పువారు లేకపోలేదు.

కాని హైందవ మత రస్తామీద వివిధరకముల అరుగులు కన్పడుచున్నవి.

ఏది ఎట్లున్నను హైందవమత మార్గము చాల విశాలముగా అనుకూలముగా నున్నది గనుక ఆ మార్గమును తప్పవద్దని నేను హిందూ—

సోదరీమణులను హెచ్చరించు చున్నాను. కాని వేరేరస్త్రాలపైద పోవు వారితో కయ్యమునకు దిగకూడదు. వారును మనమునుచేరిన గమ్యస్థానమే చేరుదురుకదా ?

వారివారి మతధర్మములను అనుసరించుట వారివిధి.

## విగ్రహారాధన

విగ్రహారాధన పూర్వ చరిత్రను జాగ్రత్తతో చదివిచూచిన, అది మొదట భయముచేతను, తరువాత సంకుచిత మనస్సుచేతను తదుపరి మానవ మనస్సు పరిపరి విధముల పరుగులిడకుండ దానిని బట్టుటకు ముక్కు పగ్గములవలె ఉపయోగించిన ఆయుధమువలె కన్పట్టుచున్నది.

మనస్సును స్వాధీనమం దుంచుకొనగలిగి సృష్టికర్తను దృగ్గోచ ము చేసుకొనగలవా డుత్తముడు.

అట్లు చేయలేక విగ్రహారాధనముచే మనస్సు తారాడకుందునట్లు చేసికొన గలవాడు మధ్యముడు.

అటు మనస్సు సుశిక్షతముగ నుంచుకొనలేక, ఇటు విగ్రహారాధకు లను దూషించువాడు నీచుడు.

తన మనస్సును రవంతయు వశపరచుకొనలేక ఇంద్రియముల చేతనే ఈడ్వబడువాడు అధముడు.

మనము సాధారణముగా మతమును మతాచారములను కలిపి మత మని పిలుచుట వాడుకైనది. మతమును గురించి విమర్శించు నప్పుడు వీటిని రెండిటిని విడదీసి విమర్శించుట మంచిది.

విగ్రహారాధన—

పటముగాని, విగ్రహముగాని మనస్సునకు నిగ్రహము గలిగించును. పుష్పములచే చేయుపూజ, హారతి కర్పూరము, సాంబ్రాణి మొదలగువాని సువాసన, గంధము మొదలగువాని చల్లదనము, దీపారాధన వెలుతురు, నోటితో చెప్పు మంత్రములు, పద్యములు, పంచేంద్రియములను ఆకర్షించు నిమిత్తము నియమింపబడిన ఆచారములు. అట్లు పంచేంద్రియములు దైవమునుగొల్పు పనులయందే యుండును గావున మనస్సు అప్పుడు నిరాటంకముగా దైవారాధన చేయవచ్చును. కావున పూజ మనస్సునకు సహాయము చేయుటకు ఏర్పడ్డ ఉపాయము—సాధకముకాని దానిఅంతట అదియే ఉత్కృష్టమగు మోక్షమునిచ్చు కార్యము కాజాలదు.

రామకృష్ణులు దేవతలా ?

రామకృష్ణులు దేవతలుకారు. వారునుమానవులే. మనసృష్టించిన శక్తిని పరబ్రహ్మయనుడు, శక్తియనుడు, సృష్టికర్తయనుడు, దైవమనుడు-అదితప్ప ఇతరులందరు మనవంటి మానవులే,

రామకృష్ణులు వారి కాలమున ఆదర్శజీవితములు గడపిన మహాపురుషులు—లేదా రామాయణ, భారత, భాగవతములు రచించిన కవుల మనస్సులకు ఆదర్శ జీవులవలె కనబడ్డ పాత్రలు—రాముడు ఏకపత్నీవ్రతుడై, తన జనుల సౌఖ్యము, ఆనందము తనదేయని నమ్మినరాజు. కృష్ణుడు యాదవకులోత్తముడు. బహు పత్నీత్వమువలన బాధలుపడుచు ఇతర విషయములందు సత్ప్రవర్తన గలిగి దుష్టశిక్షణ, శిష్టరక్షణ కావించిన బుద్ధిశాలి.

రామాయణ, భారత, భాగవతములు ప్రవర్తనధర్మములు బోధించు (Allegorical) గ్రంథములని చెప్పవచ్చును.

భగవద్గీత నిజముగా కృష్ణుని నోటినుండి వెలువడినదో, భారతము రచించిన కవిసృష్టియో ఇప్పటికీ మనకు తెలియకున్నది. రామకృష్ణులవంటి యోధులు నేడు మనలో లేకపోలేదు. ఏకాలపు మంచివారిని (రాజు, కవి, ధర్మశాలి, గురువు) ఆ కాలమునందే మంచివానిగా గుర్తించుట మానవ చరిత్రలో ఇదివరకులేదు. మహమ్మదు, క్రీస్తు, సోక్రటీసు, మొదలగువారు తమ కాలములో ఇతరులచే అవమానింపబడిరి కదా?

మానవులకు, మృగములకు భేదము.... మానవులలో మృగములకు అగమ్య గోచరమగు కొన్నిశక్తులు ఇమిడియున్నవి. ఏ మానవుడు మంచి ప్రవర్తనగలిగి, కోపమోహతమములను ఇంద్రియములను జయించి ఆదర్శ జీవితమును గడుపగలిగిన ఆ మానవుడు మహాపురుషుడు. అతడు సామాన్యులమైన మనవలెగాక కొన్ని గొప్ప శక్తులను సంపాదించి యుండును. భవిష్యత్తును జూడగలడు. ప్రపంచము నంతటినీ ఒక్కసారి తన మనస్సునందున్న అక్షముతో వీక్షింపగలడు, శపింపగలడు. ఆశీర్వదింపగలడు, మనకు ఆశ్చర్యము గలిగించెడి కృత్యము లెన్నియో చేయగలడు.

అట్లు మానవుడు శపింపగలిగి, ఆశీర్వదింప గలిగినతోడనే మనము భయపడి, ఆశపడి వానిని దైవము (సృష్టికర్త)గా మనస్సునందు దలంచుట పొరపాటైనది. కాని ఆ పురుషుడు గౌరవనీయుడు. మన ఆదర, అభిమాన పూజాదు లందుటకు పాత్రుడు—తనయందు ఇమిడియున్న మహాశక్తుల (అందరికీ యుండును గావున) తేజస్సు నియ్యగలిగిన ధీమంతుడు. అంత శక్తివంతు డగుటకు అతడు ఎంతయో శ్రమ (యోగభ్యా

:సము) దీక్షవహించి యుండవలయును కదా? అట్టివాడు పూజార్హుడు.
.గౌరవనీయుడు.

కావున రామకృష్ణులు దేవతలు కాకపోయినను పూజార్హులే కదా?

—:o:—

# 7. సౌందర్య పోషణ

"సిగ్గుపడుటగల్గి సింగారము గల్గి" అని వర్ణించాడు ఒక మహాకవి.

స్త్రీకి, సిగ్గూ సింగారమూ అవసరమే:

యౌవనవతి వంచీ వంచనితలతో చూచీచూడని బెళుకుచూపులతో, :నవ్వీ నవ్వని ఎఱ్ఱని పెదవులతో సిగ్గుపడుచుండ ఎంత అందముగా .నుండును!

అట్లే చక్కగా తలదువ్వుకొని, బాగుగ బట్టకట్టుకొని, బొట్టు కాటుకలు దిద్దుకొని, ఆభరణములు పువ్వులు అలంకరించుకొనిన స్త్రీ ఎంత కన్నుల పండువుగా నుండును.

స్త్రీలు సిగ్గూసింగారమూకూడ యౌవనముతోపాటు క్రమక్రమముగా విడువవలసి వచ్చును. కాని స్త్రీ ఎంత వృద్ధురాలైనప్పటికీ "నేను ముసలి దాననగు చుంటిని. నాకు అందచందము లెందుకు?" అని సౌందర్యపోషణ మానకూడదు. స్త్రీకి తన సౌందర్యపోషణ సహజలక్షణము. తాను అందముగా నుండిననే తానుండు గృహము అందముగా ఆనందము నొసగు నలంకారములతో కళకళ లాడుచుండును. తన సౌందర్యముపట్ల శ్రద్ధవహింపని స్త్రీ, గృహమునుకూడ అందముగా నుంచనేరదు.

కాని ఈ సౌందర్యపోషణ ఎట్టిది? సౌందర్యపోషణ ఇట్టిది అని చెప్పుట దుస్తరము. ఒక్కరికి మూతికి బుగ్గలకు రంగుపూసిన అందము. ఇంకొకరికి పూసిన అది పగటివేషమువలె నుండును. కొందరు కాటుక బెట్టుకొనిన వారికండ్లు కలువరేకులవలె నుండును. మరికొందరు పెట్టు కొన్న గుడ్లగూబ కండ్లను స్ఫురింపజేయును. కొందరు కమీజు తొడిగిన అందము. కొందరికి బ్లవుసుతొడిగిన అందము. ఎఱ్ఱనిపిల్ల ఊదాచీరె కట్టిన అందము. అదే నల్లపిల్లకట్టిన చీకటిరేయి మబ్బువలె నుండును. నల్లనిస్త్రీకి బంగారువన్నె చీరెగట్టిన అందము. అదియే ఎఱ్ఱనియువతి గట్టిన దిగతుడిచినట్లుండును.

కావున ప్రతిస్త్రీ తనరంగుకు, పొడవుకు, లావుకు, వయస్సుకు ఏవిధమైన వస్త్రధారణ ఆకర్షనీయముగా నుండునో పరీక్షించి చూచుకొని ధరింపవలయును. "అదిగో ఆయమ్మగట్టె నేనేల కట్టకూడదు" అని మాత్రము అనుకరించకూడదు.

స్త్రీకి ఆభరణములు అవసరము—రత్నమునకునూ సాన కావల యును కదా?

అట్లే స్త్రీ ఎంత అందము గలదైనప్పటికి ఆభరణములు ధరించిన మరింత అందముగా నుండును. కాని వాలు వీలు లేకుండ, అందము చం దము గమనింపకుండ ధనమున్నదని కనబడిన ఆభరణములెల్ల కొనిధరిం చిన గుడిలోని దేవుని అలంకరించి నట్లుండును. కొద్ది ఆభరణములు కొద్ది ధనవ్యయము తోడనే స్త్రీ చక్కగా అలంకరించుకొన వచ్చును.

ప్రస్తుతము బంగారువెల మితిమీరిన రోజులలో సన్నని నాజూకైన ఆభరణములు ధరించుట స్త్రీవిధి. వైద్యుడు చెప్పినదే రోగి కోరుట సం మది కదా?

సంఘములో నేటి స్త్రీయొక్క దుస్థితినిబట్టి కొన్ని పూర్వాచారములు అవలంబనీయములై యున్నవి. వానిలో ఒకటి మనస్త్రీ తన ఆభరణముల రూపకములో స్త్రీ ధనమును తన స్వాధీనమందు కొంత యుంచుకొన గలుగుట. పై కారణమునకై పెక్కు ఆభరణములు చేయించుకొన్న స్త్రీ అన్నియు ఒక్కసారిగనే అలంకరించు కొనవలసిన అవసర మేమున్నది? ఒక్కసారి యొకటి, మరొకసారి వేరొకటి అలంకరించుకొనిన క్రొత్తదన ముండి, అందముగా కూడ నుండును. స్త్రీ, తన అలంకరణయందు వివేక జ్ఞానముపయోగింప వలయును.

కాని, భర్త సంపాదించెడి సొమ్మంతయు తన సౌందర్యపోషణకే ఖర్చుపెట్టెడి స్త్రీలు అచ్చటచ్చట లేకపోలేదు. అట్టి స్త్రీలు గమనించవలసిన విషయమేమన్న మిక్కిలి ధనము వ్యయముగాకుండనే సౌందర్యపోషణ చేసికొనుట చాల సులభము. ఆభరణములకు బంగారము, రవ్వలు అవసరము లేదుకదా? గ్లాసుగాజులు, పువ్వులు, కుంకుమ, కాటుక, శుభ్రమైన బట్ట, పూసలు, సౌందర్యపోషణకు చవుకగా లభించు పరికరములు కదా?

ఉన్నంతలో తగినట్లు సౌందర్యపోషణ, సంసారము దిద్దుట చేయు భారము యువతులపై నున్నది. కావున వారి బుద్ధి సూక్ష్మత, సంస్కృతి ప్రదర్శించి లోకమునకు దారిచూపుటకు యత్నింపవలయును.

—:o:—

# 8. పాకకళ

పాకకళలో పేరుగాంచినవారు నలభీములు. ఎంత అశ్చర్యకరము? పాకశాస్త్ర విర్మాతలు పురుషులగుట!

మన ఆంధ్రదేశములో మనము ఎక్కువగా కారపువస్తువులు—కూరలు పిండివంటలు, ఊరుగాయలు, పచ్చళ్లు తిందుము. మన ఊరుగాయలు జగత్ప్రసిద్ధినందినవికదా! ఉత్తర హిందూస్థానమునుండి కన్యాకుమారివరకునుండు ప్రజలును, విదేశీయులును, మన ఆంధ్రుల గోంగూర, ఆవకాయ అనిననోరూర్చుకొందురు!!!

కాని మనము తీపివంటలు (మిఠాయి) కన్నడము, బంగాళా, మహారాష్ట్రులనుండి నేర్చుకొనవలయును.

కన్నడులయొద్ద మనము ముఖ్యముగా నేర్చుకొనవలసినది వారి ఆతిథిసత్కారము. హిందూస్థానీవారినుండి నేర్చుకొనవలసినది వడ్డన విధానము.

మన పాకకళను గురించి ఇదివరకు తగినపుస్తకములులేవు. అనేక నలభీమపాకములు బజారులో అమ్మబడుచున్నను అని ఏవియును క్రొత్తగా వంటనేర్చుకొనువారికి ఉపయుక్తము కాజాలవు. అంగ్లమున నున్న పుస్తకములలో త్రాములు, తక్కెడలు, ఉపయోగించమని, వేడి ఇంత కొంపరేచరు అనియు వ్రాయుదురు అవి మనకులేవు గనుకను, అవసరములేదు గనుకను ఆ పుస్తకములు మనకు పనికిరావు. మన ఆంధ్ర సోదరీమణులలో ఎవ్వరైన ఈకొరత దీర్చవలయును.

ప్రతి స్త్రీయు గొప్పఇంటిబిడ్డ కానిండు గారాబుపట్టి కానిండు వంటనేర్చియుండవలయును. వంటవాండ్రను బెట్టుకొను శక్తిగలవారికిని



4

అప్పుడప్పుడు వంటచేయవలసివచ్చును. వంటవానికి జబ్బుచేయును, లేక క్రొత్తయూరికి వెళ్ళుదురు. వంటవాడు పనివదలుకొనిపోవును. అప్పుడు ఎట్లు ? స్త్రీ గృహములోనుండగా పొయ్యి అంటించకుండ హోటలులో భోజనము తెప్పించుకొనుట ఇప్పటి క్రొత్తగా పెండ్లిచేసికొన్న దంపతులకు "ఫ్యాషన్" అయిపోయినది, అట్లు ఒక్కపూటైన పూటకూలి ఇంటి ఇంటినుండి తెప్పించుకొనకుండుట మన సోదరీమణులు నేర్చుకొనవలయును. హోటలునుండి తెప్పించుటవలన కలుగు పలురకపు హానులు అందఱకును తెలిసినవే! సోషలిజము బాగుగా మన దేశమున విజృంభించునని చెప్పుటకు సంశయములేదు. అప్పుడు నౌకరులు ఇప్పటివలె దొరకుట దుర్లభమగును. ఆ పరిస్థితులలో మన చెల్లెండ్రు పుత్రికలు వంట చేయవలసివచ్చిన చేతగాక నానాబాధలు పడుటకంటె ఇప్పుడే నేర్చుకొనుట శ్రేయోదాయకము.

వంట నేర్చుట కష్టముకాదు. బాగుగ వంటచేయుటకు ఓపిక అవసరము. నాకురాదు వంట ఎట్లుచేయవలె నన్న అదిరాదు. ప్రయత్నము చేసిన సునాయాసము గావచ్చును. ఇంటి స్త్రీకి బాగుగా వంటచేయుటవచ్చి యున్నచో వారు వంటవానికి "ఇట్లు, అట్లు," అని చెప్పి బాగుగ వంట చేయించుకొనగలుగుదురు.

నీ బిడ్డలకో, నీ భర్తకో, నీ తలితండ్రులకో ఇష్టమైన పదార్థము నీవే రుచికరముగా తయారుచేసినప్పుడు వారావంటకములు భుజించి తృప్తి పడుట చూచిన ఎంత ఆనందము కలుగును.

—:౦:—

# 9. తీరికసమయము

ఆంధ్రనారి తీరికసమయమున వృథాకాలక్షేపము చేయరాదు. "పుల్లమ్మ చెడ్డది, ఎల్లమ్మ మంచిది" అని ఇతరుల విషయములు మాట్లాడుకొనుట మానుట ప్రతిస్త్రీ నేర్చుకొనవలసిన విషయము. ఇతరుల వ్యవహారములలో "ఎవరికివారే యమునాతీరే" అన్నట్లుండినచో అందఱకు శ్రేయస్కరము.

ఒక్కచోట పదిమంది స్త్రీలు కలుసుకొన్నప్పుడు ఇతర అమ్మల విషయములు మాట్లాడుకొనుటకన్న ఏదైన వంటవిషయమో, గృహనిర్వహణ విధానమో, వారు చేయు చేతిపనులు, కుట్టు, బట్టల విషయములో మాట్లాడుకొనిన, కొన్ని క్రొత్తసంగతులు తెలుసుకొనవచ్చును.

స్త్రీలు తమ తీరికసమయమందు ఆటలు, పాటలు, కుట్టు, గృహాలంకారము, గ్రంథపఠన, వేరుబాషలు నేర్చుకొనుటయందు శ్రద్ధతీసికొనుట మొదలగు ప్రయోజనకర కార్యములు జేయవలయును.

ఆటలు:—గచ్చకాయలు, గవ్వలు, కేరమ్సు, ఫోకరు మొదలగునవి ఆడుట వృథా కాలక్షేపము.

చదరంగము (Chess) బ్రిడ్జి (Bridge) మొదలగు ఆటలు మనస్సును ఏకాగ్రత శిక్షయందుంచుట నలవఱచునవి గావున అవి మితముగా ఆడవలసిన ఆటలే.

బ్యాటమెంటన్ ( Badminton ), టెన్నిసు (Tennis), మొదలగు ఆటలు స్త్రీకి వ్యాయామమునకుపయుక్తములై, మనస్సునకు విశ్రాంతి గలుగచేయును గావున వీలున్న స్త్రీలు ఈ ఆటలు ఆడుట మంచిది.

పాటలు:—గాన విద్యకు సాధన (Pratice) చాల అవసరము గావున సమయమున సాధన చేయవలయును.

కుట్టు:—కుట్టుపనులు పలురకములు కలవు.

వల వలెయుండు వస్త్రముమీద కుట్టుపని క్రాస్‌స్టిచ్ అందురు. గుడ్డమీద పువ్వులూ వగైరాల చిత్రములువేసి కుట్టునది ఎంబ్రాయిడరీ. దారమును క్రోషాసూదితో అల్లుపని క్రోషావర్కు అందురు. ఈపనిలో కేవలము లేసులు, మేజాగుడ్డలు, సంచులుగాక పువ్వులు, కాయలు, ఆకులు వగైరాల అల్లవచ్చును. స్మాకింగు, ప్రెంచినోటు, బ్రాంచికుట్టు, చెయ్యికుట్టు అనునవి కొన్ని రకముల కుట్లు. నూలుతీసి కుట్టుపనిని "డ్రాన్ త్రెడువర్కు" అందురు. క్రోషాసూదితో (దంతము) ఊలుకూడ అల్లవచ్చును. రెండు సూదులతో ఊలుబెట్టి స్వెట్టర్లు, మేజోళ్ళు, గ్లవ్సు, టోపీలు, శాలువలు అల్లుదురు. దానిని నిట్టింగు అందురు.

పటములు:—అట్లసు్ప గుడ్డమీద అందముగా కుట్టుటకు అనేక రకరములైన సూదులున్నవి.

పటములు వేరేరకముగాకూడ తయారు చేయవచ్చును.

(1) వలగుడ్డ (2) వలఅట్ట (3) గాజులు (4) సిగరెట్టు కాగితములు (5) రిబ్బన్లు (6) పూసలు (7) సిల్కు, జరీ, చెమికీ.

పటములు చేయుటగాక రిబ్బన్లతో దిండుగలీబులు, టేబిలుగుడ్డలు, చాపలుచేసిన, చాలబాగుండును.

చెమికీ పనులు అనేక విధములు కలవు.

దోమ తెరగుడ్డను ఉపయోగించి స్వెట్టర్లు, చేతిసంచులు (Hand Bags) మేజాగుడ్డలు తయారుచేయవచ్చును.

పట్టుదారములు అసువంటి దానికిచుట్టి అనేక విధములగా ముడి వేసి జాలరు. తయారుచేయవచ్చును.

పూసలతో లేసులు, సీసాలతో బొమ్మలు, పింగాణీ బొమ్మలకు అలంకరణ బుట్టలు వగైరాలు చేయవచ్చును.

అద్దము ముక్కలు, పూసలతో అనేకరకముల పనులుచేసిన బహు ఆకర్షణీయముగా నుండును.

సన్నని చెక్కతో చేయుపనిని ఫ్రెటువర్కు అందురు. ఈపని కొంచెము సుకుమారలగు స్త్రీలు చేయలేరు.

ఒక్క గుండ్రని అట్టముక్క సూదిదారముతో బహు అందముగా గుండ్రపు పూలుచేసి, టేబిలుగుడ్డగనో, పర్దా బట్టగనో తయారు చేయవచ్చును.

పై చెప్పిన కుట్లు గాక ఎన్నియూ ఇతర రకములైన కుట్లున్నవి.

తెలుగులో ఈపై కుట్లన్నియూ కేంద్రీకరించి ఒక పొత్తముగా తయారుచేయవలసినపని ఆంధ్రసోదరీమణులది.

కుట్టువచ్చినవారు రానివారికి నేర్పుట ధర్మము. ఉత్తర హిందూస్థానమున, ఏడు ఎనిమిది వర్షముల వయస్సు పిల్లలుకూడ చక్కగా ఎంబ్రాయిడరీ, నిట్టింగు, క్రోషోపనులు చేయుదురు. ఉత్తర హిందూస్థానపు స్త్రీలు ఒక్క నిమిషమైనను వృథా కాలక్షేపము చేయరు. స్నేహితురాండ్రతో మాట్లాడనిండు, వారి ఇండ్లకుపోనిండు, చేతిలో వారు కుట్టునది పట్టుకొనిపోయి కుట్టుకొనుచు మాట్లాడు కొందురు. వారి ఇండ్లలో అందముగాకుట్టిన పెక్కు వస్త్రములు కనబడును.

పేము పనులు, రాట్నము వడకుట, తివాసులునేయుట మిక్కిలి సులభముగా నేర్చుకొనవచ్చును.

ఇవి అన్నియుగాక ప్రతిస్త్రీ కత్తిరింపు, మిషన్‌కుట్టు నేర్చుకొనవలయును. వారివీ వారి బిడ్డలవీ బట్టలు వారే కుట్టుకొనవలయును. మిషనులు అందరు కొనుక్కొనవలయును, శ్రీమంతులు వారి చిత్తము వచ్చినట్లు కుట్టుకొనుటకు వీలుండును బీదలకు జీవనోపాధికాగలదు. ఉత్తర హిందూస్థానమున మిషన్ ఇంటిలోలేదు. అనిన చాల అవమానము - వారు మీ అమ్మ అది కూడనియ్యలేదా యని అడిగెదరు.

బీదలు మిషనుతో కుట్టుపనిచేసియు, లేసులు వగైరాలు అల్లి మర్యాదగా ధనార్జన జేసికొనవచ్చును.

పాతగుడ్డలు పారవెయ్యక పనిబిడ్డలకు రంగుదారముతో "నేప్‌కిస్లు" అంచులతో సంచులు, దుప్పట్లుకుట్టిన అందముగానుండును.

## గృహాలంకారము

ఇంటికి అప్పుడప్పుడు సున్నము కొట్టించుచుండవలయును. మీ పిల్లలు గోడలమీద పిచ్చిగీతలు గీయకుండగను, నవుకర్లు చేతుల మురికి, గోడలకు పూయకుండునట్లు చూడవలయును.

మీ కఱ్ఱసామానులు—మంచములు, కుర్చీలు వగైరాలకు మీరు స్వయముగాగాని. పనివాని మూలమునగాని ఏడాది కొకసారైన వార్నీసు పూయవలయును.

నేలమీద నూనె వగైరాలు వదులునట్లు అప్పుడప్పుడు సబ్బుగాని శీకాయగాని వేనీ కడిగించవలయును.

పటములు, వరుసక్రమము లేకుండ గోడలకు కొట్టకూడదు. అందముగానుండునట్లు కొట్టవలయును.

పాత్రసామాను మీరు వాడనివి ఆటకలు ఎక్కించక, చక్కగా పేడారికొక్కసారియైన తోమించి అందముగా అమర్చవలయును.

కిటికీలకు తలుపులకు పర్దాలు, బల్లలకు గుడ్డలు, నేలకు కంబళ్లు వేసిన ఇంటికి అందము వచ్చును.

బల్లలమీదపెట్టు పూలతొట్లు (Vases) లో కాగితపు పువ్వుల కన్న సహజమైన పువ్వులు, ఆకులు పెట్టిన అందము. పువ్వులు అలంకరించుటకూడ ఒక విద్యయే: చైనా, జపాను దేశములలో వారి పిల్లలకు ఎంతో కష్టపడి ఈవిద్య నేర్పెదరట!!!

ఒక్కొక్కగదిలో ఆగదిలో నుండవలసిన సామానులే యుంచవలయును. అన్నియు గందరగోళముగా ఎక్కడపడిన అక్కడ పడవేయకూడదు.

గోడలకు మేకులు, దండెములు కట్టిన చాల, అసహ్యముగానుండును. ఉతికిన బట్టలు చక్కగా మడిచి పెట్టుకొనవలయును.

ఇంటిలో పాడియున్న వారు, వారి పశువులను దూరముగా కట్టివేయవలయును.

బజారులో ఎక్కువ వెలపెట్టి కొనవలసిన పనిలేకుండ స్త్రీ కొంచెము కష్టపడి తయారుచేసిన కుట్టుపనులతో గృహమును ఎంతో అందముగా శృంగారించుకొనవచ్చును:

గ్రంథపఠనః—మీ తీరినసమయములందుగాని విశ్రాంతి దీసికొను చున్నపుడుగాని ఏదో ఒక పుస్తకమును చదువుచుండవలయును, అనుదినము

పత్రికను చదువుట అలవాటు చేసికొనవలయును. మన ఆంధ్రులలో పుస్తకములు, పత్రికలుకొని చదువు అలవాటులేదు. మన జాత్యభ్యుదయమునకు గ్రంథపఠన, రచన, చాల అవసరముకదా?

ఎక్కువ వెలగల పుస్తకములు కొనుటకు శక్తియుండదు కనుక, చాల పుస్తకములు చదువువారు అన్ని పుస్తకములు కొనుటకు వీలు లేదు గావునను అన్ని ఊళ్ళలో గ్రంథాలయములలోని పుస్తకములు తెచ్చుకొని చదువవలయును. గ్రంథాలయములు లేనియెడల అవి స్థాపించుటకు సంఘమున ప్రోత్సాహముకలిగింప మీరే పూనుకొనవలయును. శక్త్యనుసారము మీమీ గ్రంథాలయములకు చందాలిచ్చుట మీ కర్తవ్యము.

స్త్రీలకు ముఖ్యముగా నుద్దేశింపబడిన పుస్తకములన్నియు చదువవలయును.

అనేక పత్రికలు స్త్రీలకొరకే ప్రకటింపబడుచున్నవి. "గృహలక్ష్మి" "ఆంధ్రమహిళ" స్త్రీల పత్రికలు. పిల్లలకు "బాల" యని ఒకపత్రిక ప్రకటించుచున్నారు. ఈ పత్రిక పిల్లలకు శ్రమకలుగచేయకుండ కులాసాగా చదువు నేర్పును. పిల్లలకు పుస్తకములు, ఇతర భాషలలో వలె మన తెనుగున ఇదివరకులేవు. ఇటీవలనే "తెనుగుతల్లి" అను ఒక పుస్తకము వెలువడినది. పిల్లలకు విద్య; జ్ఞానమునిచ్చు పుస్తకములు మీ బిడ్డలకు తినువస్తువులు, బొమ్మలు కొనిపెట్టినట్లు కొనిపెట్టవలయును. మీరు పిల్లలకు స్వంత డబ్బు ఇచ్చినప్పుడు, పుస్తకములకు చేయు ఖర్చు సద్వినియోగమని చెప్పవలయును. విద్యావంతులైన బిడ్డలేకదా రేపు మనకును, దేశమునకును ఆనందగౌరవముల నిత్తురు!

అన్యభాషలు అలవరచుకొనుట ?

మనము వీరైనన్ని ఇతరభాషలు నేర్చుకొనుటకు ప్రయత్నించవలయును. మనకు పరిసరములలోనున్న కన్నడ అరవ భాషలను, కొద్దిగా ఆంగ్లమును, హిందీనితప్పక నేర్చుకొనవలయును. వీని అవసరము అందరకు తెలిసియేయున్నది.

—:o:—

# 10. వైద్యవిధులు

"ముదితల్ నేర్వగరానివిద్యకలదే ముద్దరనేర్పించినన్"

ప్రతిస్త్రీ వైద్యవిద్య కొద్దిగా నేర్చియుండవలయును.

ప్రతి ఇంటిలోను ఉంచుకొనవలసిన వైద్యసామగ్రి:—

(1) థర్మామీటరు

(2) ఉడుకునీళ్ల సంచి

(3) ఐసుసంచి

(4) ఎనిమా కేన్

(5) బెడ్డుపేన్ (Bed pan)

(6) బేసిన్

(7) కిరసనాయల్ లేక ప్యూయల్ స్టౌ.

ఈ వస్తువులు క్రొత్తగా కాపురమునకు రాగానే సమకూర్చుకొనవలసిన ముఖ్యమైన సామగ్రి. వైద్యమునకు కావలసిన వస్తువులకు పెట్టె

డబ్బు వృధాకర్చుఅని తలంపకుడు. అవసరమున్న మీరు ఒక్క చీరకొనుట మానిన పైవైద్యసామగ్రి అంతయుసమకూర్చుకొనవచ్చును. ఏకాలమునకు ఏది ఉపయోగపడునోకదా !

జాగ్రత్తగల స్త్రీ ఒక చిన్న చెక్కపెట్టెగాని, ట్రంకుపెట్టెగాని మందులకై ఏర్పాటుచేసికొనవలయును. ఈ పెట్టెలో థర్మామీటరు, ఉడుకునీళ్ళసంచి, ఐస్‌బ్యాగు పెట్టుకొనవలయును. ఈక్రింద ఇచ్చిన జాబితా వస్తువులు కొన్కకొనవలయును.

(1) కొంచెము దూది (Cotton)

(2) గాజుగుడ్డ

(3) టించరు ఐడిన్ (Tincture Iodine)

(4) ఐయోడెక్సు (Iodex)

(5) సి. ఏ. క్యూ (C. A Q.)

(6) ఏస్పరిను (Asperine)

(7) క్వినైను మాత్రలు (Quinine pills)

(8) క్యాస్టొఫీను (Castophine)

(9) గోపాలాచార్యుల తేలు, పాముమందు.

(10) ఫ్రూట్‌సాల్టు (Fruit salt)

(11) బోరిక్ పవుడరు (Boric Powder)

(12) పొటాసియమ్ పర్మాంగనేటు (Potassium permanganate)

(13) డెట్టాల్ (Detto')

(14) యూడీకొలోన్ (Eoudecolone)

(15) టానాఫోక్సు (Tanaufox)

(16) యాక్లిప్టస్సు లేక అమృతాంజనము.

ఇవి అన్నియును కొని ఆ పెట్టెయందు భద్రము చేయవలయును. ఇవి అన్నియుకలసి సుమారు ఇరువది రూపాయలకు దొఱకును. పై మందులన్నియు తెప్పించి ఇచ్చట అచ్చట ఒక్కొక్కటి పడవేయక, వాని మూతలన్నియును సరిగాబెట్టి మీ మందులపెట్టెయందు పెట్టుకొనవలయును. వానితో అవసరమువచ్చినప్పుడు అందులోనుండి మందుతీసి తిరిగి సీసా ఆపెట్టలోనే పెట్టవలయును. "ఇప్పుడే పెట్టుదును" అని ఏ బల్లమీదనో మంచముదగ్గిర కిటికీలోనో పెట్టకూడదు. ఈ విషయము బహుముఖ్యము. మరవకుడు. ఈ పెట్టెను మీరు ఏయూరికి పెండ్లికి వెళ్ళినను పేరంటము నకు వెళ్ళినను తీసికొని పోవలయును. ఎప్పుడును మీరు ఈమందులలో ఏ అవసరము వచ్చునో, అని అనుకొనవలయును.

ఇది మీకు తగిన సమయమందు ఉపయోగపడినప్పుడు దాని అవసరము, నాసలహా విలువ మీకే తెలియును. పిల్లలకు ఈ మందుపెట్టెను అందుకొనకూడదని చెప్పవలయును.

ఎవ్వరైన హోమియోపతి వైద్యులు మీకు బాగా పరిచితులైన వారివద్ద సాధారణముగా జలుబు, జ్వరము, విరోచన సంబంధపుమందులు అడిగి తీసికొని పెట్టెయందు జాగ్రత్తచేయవలయును.

ఇవి అన్నియు సేకరించి జాగ్రత్తచేయుట కొంచెము శ్రమ మాత్రమేగాని ధనవ్యయము ఏమియులేదు. ముఖ్యముగా పల్లెవాసులు వీనిని జాగ్రత్త చేసికొనవలయును. పల్లెటూళ్ళలో సాధారణముగ నివి దొఱకవు. ఇట్టి అవసరమైనని ఇంటియందు లేనియడల పట్టణములం

దైనను కావలసివచ్చినప్పుడు మందుల దుకాణము మూసియుండుటో, తెచ్చుటకు మనుష్యులు లేకపోవుటో, తెచ్చులోపల ఏదైన ప్రమాదము గలుగుటయో ఇతరులను అడగవలసిన అవసరమగుటయో సంభవించును.

ఈ మందుల సీసాలన్నిటిమీద పేరులు స్పష్టముగా వ్రాసియుండవలయును. మీరు మందు ఉపయోగించునప్పుడు ఆ మందులపేర్లు జాగ్రత్తగా చదువవలయునుగాని, సీసాల గుర్తులు పెట్టుకొని ఇవ్వకూడదు ఈ సలహాలను చదివిన ప్రతిస్త్రీ ఈవిధముగా ఒక చిన్నపెట్టె తయారుచేసికొనిన నేను ఎంతయేని సేవచేసిన దాననగుదును. ఇట్టి చిన్న చిన్న పనులుచేయుటకు ఓపికలేని స్త్రీ గృహనిర్వహణ ఏమిచేయకలదు !

(1) టించరు ఐడిన్:- గాయములుతగిలి రక్తము కారుచున్న కొంచెము దూది ఉడుకునీళ్లలో ముంచి దానిలో గాయమును తుడిచి, టించరు ఐడిన్ కొద్దిగాపూసి, పైన గొంచెము దూదిపెట్టి గాజుగుడ్డతో కట్టుకట్టవలయును. తరువాత రోజును ఉదయము, సాయింకాలము కొంచెము వేడినీటిలో బోరిక్‌పవుడరువేసి గాయమునుకడిగి టించరు ఐడిన్ పూయవలయును. గాయము చాల పెద్దదైనను, ఎముక మొదలగునవి విరిగినవని సంశయమున్నను, వెంటనే డాక్టరుకొరకు కబురు పంపవలయును. బెణకిన ఒకగుడ్డ చన్నీళ్లలోతడపి ఆ బెణకినచోటున చుట్టి వెంటనే వైద్యుని సలహా తీసికొనవలయును.

(2) ఐయోడెక్సు:- ఇది టించరు ఐడిన్‌వంటిదే. పిల్లలు టించరు ఐడిన్ భరించలేనియెడల ఇది వాడవచ్చును.

(3) సి. ఏ. క్యూ:- ఇది స్పెన్సరు షాపులలో దొరకును. జలుబు, దగ్గు, జ్వరములకు ఇచ్చినవెంటనే గుణము కనబడును.

(4) ఏస్పరిను :- తలనొప్పి, గొంతునొప్పి, మొదలైన నొప్పులకు, జడలికకు వేడికాఫీతోగాని వేడినీటితోగాని తీసికొనిన బాధతగ్గును.

(5) క్వినైను మాత్రలు :- మలేరియాజ్వరమని మీకు రూఢిగా తెలిసిన జ్వరమువచ్చిన వెంటనే ఇవ్వవచ్చును.

(6) క్యాస్టఫీను :- మలబద్ధకమునకు. తియ్యగానుండును గావున పిల్లలు మారాము చేయకుండ తీసికొనెదరు. ఈమందు దొరకనియెడల ఈవిధమైన మందేవేరు పేర్లగలవి మందులషాపులలో అడగిన ఇత్తురు.

(7) గోపాలాచార్యుల తేలు పాము మందు :- ఇది ఏ పురుగుకుట్టినను చాల నుపయుక్తమైన మందు.

(8) ఫ్రూట్ సాల్టు :- మలబద్ధకము, వాంతి వచ్చునట్లుండుట, నరరములు పొత్తికడుపులో పట్టుకొన్నట్లుండిన యెడల సోడా త్రాగినట్లు నీటిలోకలసి త్రాగవలయును. రుచికికూడ సోడావలెనే యుండును.

(9) బోరిక్‌పవ్డరు :- గాయములు కడుగుటకు ఉపయోగింతురు. దీనితో కళ్ళకు పుసులు, కళ్ళకు కురపులున్న వేడినీళ్లలోవేసి దూదితో కళ్ళుతుడిచిన మంచిది.

(10) పొటాసియమ్ పరమాంగనేటు :- కలరా మొదలగు వ్యాధులు చుట్టుప్రక్కలనున్న కూరగాయలు, పండ్లు ఈమందు నీటిలోవేసి కడుగవలయును,

(11) డెట్టాల్ :- రోజూ తమలపాకులువేసికొను అలవాటుగల స్త్రీలు, రాత్రి నిద్రించుటకుముందు పండ్లుకడిగి ఈమందు కొద్దిగా నీళ్ళలో వేసి పుక్కిలించినపండ్లు గారపట్టక, నోరు వాసన రాకుండ శుభ్రముగా

మందును. ఎక్కడైన అంటువ్యాధులున్నచోట్లకు వెళ్ళివచ్చిన, ఈమందు నీటిలోవేసి స్నానముచేసి నోటపుక్కిలించి ఉమియుట మంచిది.

(12) యుడీకొలాన్ :- జ్వరము ఎక్కువగా వచ్చినప్పుడు ఐస్ బదులు ఉపయోగపడును. ఎండదెబ్బ తగిలినవారికికూడ ఉపయోగ పడును.

(13) టనాఫోక్సు :- కాలినచోట రాయవలయును. చాల ఉపయో గము కన్పించును. వేడినీళ్లు పడినగాని, వేడినూనె చిందినగాని, దీపము కాలినగాని వెంటనే కొంచెము పూసిన చాల ఉపయోగము కన్పడును. కాలినచోట నీళ్ళు తగులనియ్యకూడదు.

(14) యూక్లిప్టస్, అమృతాంజనములు :- వీని ఉపయోగములు అందరకు తెలిసినవే!

## ఎండదెబ్బ తగిలిన మనుజునికి ఈ విధముగా చికిత్స చేయవయులను :

నీడగా, చల్లగానున్న స్థలములో పరుండబెట్టి బటలన్నీ వదులుచేసి, విసరుచూ వెంటవెంటనే చన్నీళ్ళుత్రాగుటకు ఇవ్వవలయును. తలమీద ఒంటిమీద మంచునంచితోగాని, తడిగుడ్డతోగాని చల్లగానుండునట్లు చేయ వలయును. డాక్టరుకు వెంటనే చెప్పిపంపవలయును.

## లోహములవల్ల దెబ్బతగిలినప్పుడు :

లోహముల దెబ్బ తగులుటవలన పడిన గాయము విషమువలే అపాయకరము (Sceptic) అగును. కావున వెంటనే డాక్టరువద్దకు పోయి ఇంజక్షను తీసికొనవలయును.

విషములు :

అప్పుడప్పుడు పొరపాటువల్లనో, అజాగ్రత్తవల్లనో పిల్లలు ఏవైన విషపదార్థములు తినెదరు. మీకు అనుమానముకలగిన వెంటనే డాక్టరు కొరకు పంపవలయును. డాక్టరు వచ్చుటకు ఆలస్యమున్న మీరు చేయ వలసినదేమనిన :-

(1) కొన్ని ద్రావకములు త్రాగిన పెదవులు, నోరుకాలును.

ఈ ద్రావకములు రెండు విధములు.

(1) ఏసిడ్ (Acid)

(2) అల్‌కలీ (Alkali).

(1) మీకు రోగిత్రాగినది "ఏసిడ్ (Asid) అని తెలిసిన, సున్నపు తేట గ్లాసులతో సమృద్ధిగా త్రాగుటకు ఇవ్వవలయును.

(2) రోగిత్రాగినది "అల్‌కలీ" అని తెలిసిన నిమ్మకాయల రసము తీసి, సమానముగా నీరుకలపి గ్లాసులతో ఇవ్వండి.

(3) మీకు ఏద్రావకమైనది (అలకలియో ఏసిడో) తెలియనియడల సమృద్ధిగా చల్లనీరుగాని, పాలుగాని ఇవ్వండి.

కాని త్రాగిన ద్రావకముచే పెదవులు నోరుకాలనియెడల :-

(1) ఒకగ్లాసు గోరువెచ్చని నీటిలో రెండు పెద్దగరిటెల ఉప్పువేసి రోగి వాంతిచేసికొనుటకై ఇవ్వండి. దీనివలన వాంతి కానియెడల వ్రేళ్ళు నోటిలోపెట్టి వాంతివచ్చునట్లు చేయవలయును.

వాంతిఅయిన పదార్థముగాని, విరోచనముగాని పారవేయ వలదు.

కళాయిలేని పాత్రలలో వండిన
చిలుముపట్టిన భోజనము పొరపాటున తినిన :

దీనికి మంచి విరుగుడుఏమన—కోడిగ్రుడ్డుతెచ్చి పగులకొట్టి దాని యందలి పసుపు తీసివేసి తెలుపుత్రాగుట.

పాముకుట్టిన :

కుట్టినచోటునుండి విషము పైకిపోకుండ గట్టిగా గుడ్డతోగాని త్రాటితోగాని కట్టవలయును. నీటిలో కొద్దిగా పొటాసియమ్ పరమాంగ నేటు కలిపికుట్టినచోట కడుగవలయును. డాక్టరుకొరకు కబురుపంప వలయును.

పిచ్చికుక్క కఱచిన :

కరచిన చోటునుండి బాగుగ రక్తము బయిటికి వచ్చునట్లు గాయముపైన పిసుకవలయును. రక్తము బైటికి వచ్చినతరువాత వేడి నీటిలో పొటాసియము పరమాంగనేటువేసి గాయమును కడుగవలయును. బ్రాందిగాని, విస్కీగాని కొద్దిగా నీటిలోకలపి ఇవ్వవలయును. అవి లేని యడల నల్లగా కాఫీచేసి ఇవ్వవలయును డాక్టరుకొరకు కబురు పంప వలయును.

పసిబిడ్డలకు వచ్చుతెరలు :

పసిబిడ్డలకు అప్పుడప్పుడు కాళ్ళుచేతులు మెలికలుపెట్టి, ముఖము నీలిరంగుకలిగి, నోటిలోనురుగు, ఊపిరిపీల్చుట, తెలియకుండుటగలిగి తెరలు వచ్చును.

చికిత్స :- బిడ్డపైన ఏమి వస్త్రములు లేకుండ అన్నీ తీసివేసి గంగాళములో ఉడుకునీరుపోసి బిడ్డను గొంతువరకు ఆనీటిలోముంచి తెర తగ్గువరకు యుంచవలయును. డాక్టరువచ్చువరకునో తెరలుతగ్గువరకునో అట్లే యుంచవలయును. తలమాత్రము తడిగుడ్డతో చల్లగానుంచవలయును, తెరలు తగ్గినతరువాత బిడ్డను బాగుగా తుడిచి వేడిగానుండునట్లు దుప్పటి కప్పవలయును, కాని తలనుమాత్రము తడిగుడ్డతో చల్లగానే యుంచవలయును.

తెరలు తిరిగివచ్చిన తిరిగి చికిత్స అదేవిధముగా చేయుము.

కాలిన :- వేడినీళ్ళు, వేడినూనె దేహముమీద పడినగాని మరేవిధముగానైన దేహము కాలినగాని "టేనాఫాక్సు" అను మందు రాచిన చాల ఉపయోగము. టేనాఫాక్సు లేనియడల సిరాకూడ ఉపయోగపడును. ఎక్కువగా కాలిన డాక్టరు సలహా పొందవలయును.

—:o:—

# 11. హితవులు

(1) తెలిసియు తెలియని మిడి మిడి జ్ఞానముతో రాజ్యాంగ వ్యవహారములందు పాల్గొనవద్దు.

(2) వేదాంతము సముద్రమువంటిది. నోట నాలుగు వేదాంతపు ముక్కలనుబట్టుకొని ఇతరులతో వాదించవద్దు. వారు చెప్పునదికూడ వినుము.

(3) వైద్యునివద్దకు పోవుటకు ముందు నీకు నిజముగా జబ్బున్నదో లేక భ్రాంతియో దృఢముగా ఆలోచింపుము.

(4) చూడవచ్చినవారందరితో అనుభవించుచున్న రోగములన్నియు ఏకరవు పెట్టవద్దు. వారు ఆరోగముల సంగతి విని ఎట్టి సానుభూతియును చూపకపోగా అసహ్యించు కొందురు.

(6) ఒక స్త్రీ, పురుషుడు మాట్లాడుట చూచినంత మాత్రముననే, ఎల్లమ్మ పుల్లమ్మ చెవులలో గుసగుసలు మొదలుపెట్టవద్దు.

(7) పొరిగింటికి భోజనమునకుపోయి కూరలో ఉప్పు చాలలేదు. అన్నము మెత్తగానున్నది - అనునట్టి యాక్షేపములు చేయవద్దు. బాగున్నదా యని అడగిన (బాగుండకపోయినను) నీవు బాగున్నదనియే చెప్ప వలయును. వారు నీకు బాగుండవలయుననియే కదా చేసెదరు. అటువం టప్పుడు బాగాలేదు అని వారిమనస్సును కష్టపెట్టుటకంటె బాగున్నదని వారికి సంతోషము కల్గించవలయును.

(8) ఎవరింటికైనను నీవు అతిధిగాపోయిన అక్కడ నీవు వారి అలవాట్లకుఅనుకూలముగా నడుచుకొనవలయునుగాని నీఇంటిలోవలె నడుచు కొన్న, వారికి చాల ఇబ్బందికలుగును.

(9) నీవు చదువుకొనినయెడల చదువుకొననివారిని అజ్ఞానులక్రింద జమకట్టవద్దు. దురదృష్టమువల్ల వారికి చదువుకొను భాగ్యములభింపలేదు. కాని వారియందు విజ్ఞాన విశేషముండవచ్చును. ఏపుట్టలో ఏ పాముండునో నీకేమి తెలియును?

(10) నీకు చదువురానియెడల, చదువుకొన్నవారు ఎందుకు పనికి రారని నిరసించకు. లేదా వారిముందట నీవ్యక్తిత్వము గోల్పోకుము.

(11) ధనికులయందు, పేదలయందు భేదములేక ప్రవర్తించుము.

(12) ఇతరుల అందము, ధనము, సుఖముచూచి ఎప్పుడు ఈర్ష్య పడవద్దు. అది నీకే ఎప్పుడును చేటుదెచ్చును.

(13) కుష్ఠు, క్షయరోగము ఇంటిలో ఎవరికైననున్న దాచక, ఎంత మాత్రము సందేహింపక వారికి దూరముగా గదినిచ్చి వారికి వస్త్రములు, స్నానము, భోజనము ప్రత్యేకముగా ఏర్పాటుచేయవలయును. ఆస్పత్రులలో చేర్పించిన ఉత్తమము.

(14) మేనరికము మానవలెను. మామబిడ్డలను చేసికొనువారు - పినతండ్రి పెదతండ్రి బిడ్డలను, అక్క బిడ్డలను చేసికొనువారు-అన్నదమ్ముల బిడ్డలను చేసికొనువారు - సములే. ఇట్టి సంబంధములు జాతిఅభివృద్ధికి విరోధములు.

(15) ధనార్జనలేని మగవానిని పెండ్లిచేసికొనకూడదు. ఎవ్వడు సొంతముగా ధనార్జనచేయక తండ్రిమీద అన్నమీద అధారపడియుండునో అట్టివానికి నీ పుత్రికనుయిచ్చి పెండ్లిచేయవద్దు.

(16) సమిష్టికుటుంబములోనుండుట సంభవించినపుడు నీవెంత మంచివానవైనను, మనస్పర్థలు రాకమానవు. కాని సహనముతో ఇతరుల సంగతి పట్టించుకొనక నీ కర్తవ్యము నీవు నెరవేర్చుము.

(17) నీకు కోడలు వచ్చినంతనే అత్తగారిపెత్తనము జూప విఱుగబడకు. నీవు అత్తవారింటికి క్రొత్తగా వచ్చినప్పటి పరిస్థితులు జ్ఞాపకము దెచ్చుకొమ్ము.

(18) నీవు అత్తవారింటికి వెళ్ళినప్పుడు క్రొత్తగా నీకుకలుగు సూటిపోటి మాటలబాధ బిడ్డల వలని ఆనందమునకు ముందు ప్రసనవేదన వంటిది. ఇది వివాహసుఖానుభవములో ప్రథమఘట్టము.

(19) అనవసరముగా ఇతరుల మనసు కష్టపెట్టే మాటలు మాట్లాడ వద్దు.

(20) నౌకరుకూడ మానవుడను విషయము మరువవద్దు.

(21) నీవు భాగ్యవంతుని బిడ్డవైనచో ఇంటిపనులుచేయుట మాయమ్మ నేర్పలేదని సాకుచెప్పకు. నేర్చుకొనుము. సోమరివి కావద్దు.

(22) నీమగడు ధనవంతుడైనను ఇంటిపనులు చేసికొనుటకు నాకు "ఏమిగతి" యని తలపకుము. ఇంటిపనులను శ్రద్ధగాచేసికొనుము. ఇంటిపనులయందు పాల్గొన్న నీ గొప్పతనమునకు ఎట్టిలోపమును రాదు.

(23) ఇతరుల రహస్యములు నీవు బయటపెట్టవద్దు.

(24) మగనివద్ద ఏవిషయము దాచవద్దు.

(25) దేశమంటే మట్టికాదోయ్, దేశమంటే మనుషులోయ్ అని ఎల్లప్పుడును జ్ఞాపకముంచుకో.

—:o:—

# 12. సంఘసేవ చేయదలచుకొన్న స్త్రీలకు కొన్ని సలహాలు

ముఖ్యముగా సంఘసేవ చేయదలచుకొన్న స్త్రీలకు కావలసినవి— ప్రపంచజ్ఞానము, ధైర్యము. సేవాదీక్ష, ఆరోగ్యము, అభినివేశము, తీరిక. ఇవి అన్నియుగలస్త్రీలు సంఘసేవకు నడుముగట్టిన వారిసేవ బహు అమూల్యమైనది అగును.

మన దేశ ప్రజలు ఎక్కువమంది గ్రామములోనుండువారు, కావున సంఘసంస్కరణ గ్రామములో బయలుదేరవలయును.

1. ఆరోగ్య సూత్రములు. వైద్యవిధులు తెలుపుట.

2. గ్రామములో మంత్రసానులు అందఱకు అందుబాటులోనుండున ట్లు ఏర్పాటు చేయుట.

3. కుష్ఠు క్షయ మొదలగు రోగులు ఇండ్లలో కలసియున్న అది వంశాభివృద్ధికి భంగకరమని వారికి బోధించి, వారికి వసతులు గూర్ప ఆరోగ్యాధికారులకు తెలుపుట,

4. చిన్న చిన్న బడులు పెట్టి చదువురాని యువతులకు అక్షర జ్ఞానము కలుగచేయుట

5. పసి బిడ్డలకు (మాంటిసోరీ విధానముతో) బొమ్మలువగైరాలతో చదువు నేర్పుట.

6. ఆ యూరిలోని గొప్ప యింటిలో విద్యావతులైన స్త్రీలున్న వారికి తీరిక ఎక్కువయుండును గావున వారి యిండ్లలోనే రోజుకు ఒక గంటసేపు అందఱకు వారు తెప్పించుకొను వివిధ పత్రికలయందలి విశేషములు, రేడియోయందలి వార్తలు తెలుపుమని కోరుట.

7. ఒక్కచోట స్త్రీలు అందరు తీరికసమయమందు కలిసి కూర్చుండి, అల్లిక, కుట్టు, రాట్నమువడకుట, కాగితములు మొదలగునవి చేయుటకు ఏర్పాటుచేయించి, ఆ తయారైన వస్తువులను అక్కడి సహకార సంఘమువారితో అమ్మించు ఏర్పాటులు చేయుట.

8. మంచిమంచి గ్రంథములు పండితులచే చదివించి వినునట్లు చేయుట.

9. మతవిషయములు, ఆచార విషయములు స్త్రీలతో తర్కించి ఉచితానుచితములు దెల్పుట.

10. ఎవ్వరైన పరిసరములలోనున్న లేడీ డాక్టరుతో ఏర్పాటుచేసి వారమున కొక్కతూరియైన ఆమె వచ్చి గ్రామవాసుల ఆరోగ్య విషయములు చూచి వారికి సలహాలు, ఔషధములు, ఇచ్చునట్లు ఏర్పాటుచేయుట.

11. గ్రామములో పురుష సహాయములేని స్త్రీలకు పత్రికలు, మందులు, వగైరాలు తెప్పించే ఏర్పాటులుచేయుట.

12. Magic Lantern సహాయముతో స్త్రీలకు శిశువులకు సంబంధించిన విషయములు దెల్పుట.

13. పాకశాస్త్రము, ఉపన్యాసము, కుట్టు, సంగీతము ఆటలు, భాషలు మొదలగు వాని యందు పోటీలు పెట్టించుట.

14. అప్పుడప్పుడు హరికథలు, నాటకములు, బుఱ్ఱ కథలు, ఏర్పాటుచేసి స్త్రీల మనస్సునకు విశ్రాంతియు, ఉల్లాసము గలిగించుట.

15. గ్రామవాసుల పిల్లలకు ఎచ్చటెచ్చట విద్యా సంస్థ లున్నదీ, వావియందు నేర్పు విద్య, వాని ప్రత్యేకత తెలుపుట.

16. రాజకీయములు క్లుప్తముగా దెలుపుట. సంఘ సంస్కరణ భారవాహకులు రాజకీయములను తెలుపవలయునేగాని వాని యందు పాల్గొనకూడదు.

—:o:—

# 13. రాజకీయములు

రాజకీయములను కొద్దిగా ప్రతి స్త్రీయును తెలిసికొనవలయును.

ఇంటిలో పనులు ఎక్కువ లేనివారు, బిడ్డలు లేనివారు, పిల్లలు పెద్దవారగుటచేత వారి సంరక్షణభారము లేనివారు, ఇంటిలో ఎవరైన వృద్ధురాలు గృహనిర్వహణాభారము మోయనవకాశమున్నవారునగు స్త్రీలు రాజకీయములలో పాల్గొనవచ్చును.

కాని రాజకీయ విషయములు పూర్తిగా తెలియకుండ నందు కాలు పెట్టకూడదు. అట్లు పెట్టిన అధోగతి పాలగుదురు. రోటిలో తలదూర్చి రోకటి పోటునకు వెఱువ గూడదు.

రాజకీయములలో పాల్గొనవలయునని ఆసక్తియున్న, రాజకీయ శాస్త్రములు, రాజ్యాంగ పద్ధతులు, వివిధదేశ చరిత్రలు, పత్రికలు చదువ వలయును.

రాజకీయములలో దిగనున్న స్త్రీకి "జాగ్రత" ! అని హెచ్చరించు చున్నాను.

స్త్రీ ఒక తప్పటడుగువేసిన జాతికే కళంకము రాగలదు. అట్లే శక్తియున్న గొప్ప కీర్తినికూడ దెచ్చు సామర్థ్యము, అవకాశము స్త్రీకి కలదు.

—:o:—

# 14. సందేశము

నారీరత్నములారా!

ఈ ప్రబోధములను విసువక చదువు మీ ఓపికకు నా యభివందనములు.

నేను కవితామాత గారాబుపట్టినిగాను. నా రచనమున గవిత్వ మున్నదో లేదో నాకు దెలియదు. నా యుత్సాహ పూర్వకోద్దేశములను నిర్వ్యాజముగ వెల్లడించితిని. స్త్రీ లోకమునకు రవంతయేని నాయీ పరిశ్రమ సత్ఫలమొసగెనా నేను చరితార్థను.

సోదరీమణులారా!

చదివి యించు సారమున్న ఆస్వాదింపుడు, లేదేని యుపేక్షింపుడు. నాకు స్వజాతిపై గల యభిమానమే నన్నీ కార్యమునకు బురికొల్పినదని యెరుంగ గోరెద.

మరి—మీరు సీత, సావిత్రి, అనసూయ మొదలగు పౌరాణిక స్త్రీలవలె తయారు కావలెనని కాదు నా ఆశయము. ఆ పౌరాణిక స్త్రీల కాలము వేరు. వారిది పురాణయుగము. మన మున్నది కలియుగము. ఇప్పటి పరిణామ పద్ధతులు వేరు. సంఘ పరిస్థితులు తారుమారయినవి. కావున నేటి మన ఆశయములు-దృక్పథములు-కూడ మార్పుచెందవలయును.

కాని—

ప్రపంచములోని అన్ని దేశములు అనేక విధముల పరివర్తనము పొందినను భారత స్త్రీత్వము ఎట్టి మార్పునుచెందక ఇతర దేశ స్త్రీలకు ఆదర్శప్రాయమై ధృవతారయై వెలయుచున్నది. కావుననే, నేడు అన్య దేశములవారును భారత స్త్రీత్వమునకు చేతులెత్తి జోహారు లొనరించు చున్నారు కదా!

భారత స్త్రీచే సృజింపబడిన ఇట్టి గౌరవ మర్యాదలను ఆరనియ్యక - ఆ గౌరవమును చిరస్థాయిగా చేయమనియే నేను ఆంధ్రనారిని కోరునది.

